

చి|| కొండూరు కమలా ప్రసాద్ దంపతులు



చి|| పాలతీర్థపు శ్రీనుబాబు దంపతులు

శ్రీశ్రీశ్రీ జగద్గురు సనారీవిశ్వేశ్వర స్వామినే నమః

# శ్రీశ్రీశ్రీ సనారీశ్వర వ్రతము





సంకలనం : సనారీ శ్వర వ్రత కర్త, సెల్ : 92905 82110
బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబాచార్య సిద్ధాన్తి




## మహదానందము

### బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబా స్వామీజీగారు రచించిన గ్రంధములు

1. శ్రీ సనారీ విశ్వేశ్వర స్వామి వారి నిత్యపూజా విధానము
2. శ్రీశ్రీశ్రీ సనారీ వారి దీక్షా విధానము
3. శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధ విజ్ఞానము - మహిమలు అను నిత్య పారాయణగ్రంధం

ఈమూడింటిని ఒకవైపుగా చేస్తే మరోకోణంలో సాక్షాత్కరించేది ప్రస్తుత **సనారీశ్వర వ్రతము.** ఏడు పదులు వయస్సును సహితం ప్రక్కనపెట్టి పదిహేడు సంవత్సరముల యువకునివలే అన్ని విషయములు సనారీవారి గురించి ఆపోశనపట్టి ఈ ప్రయత్నం చేయడం కొంచెం సాహసమైనప్పటికీ సర్వాంగ సుందరంగా తాడేపల్లి మండలం మహానాడు గ్రామము సీతానగరంశివారున శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్రలింగసహిత విశ్వనాధ (సనారీ) వారి ఆలయ నిర్మాణంచేయడం దానితోపాటు అనతికాలంలోనే సనారీ ఆలయానికి గోపురనిర్మాణం చేసి శిలాధ్వజప్రతిష్ఠ శాస్త్రీయంగా చేయించడమంటే అసాధ్యమైనపనియే.

శ్రీ స్వామీజీ వారు బాల్యం నుండి ఆధ్యాత్మిక భావనలతోనుంటూ రెండు దశాబ్ధలుపైబడి శ్రీ సనారీవారి పాదంపట్టి సేవ చేయడం ప్రారంభించిననాటినుండి స్వవృత్తికి సైతం స్వస్తిపలికి శ్రీవారి చరణసేవకు అంకితమై వానప్రస్థాశ్రమ జీవనము గడుపు ఈ మహనీయునకు చంద్రునకో నూలుపోగుగా ఈ పుస్తక ముద్రణ కు నావంతు సహకారమందిస్తూ ఇంకా అతి త్వరగా మరిన్నీ సనారీవారి గ్రంధాలు వీరి కలమునుండి జాలువారాలని మనసారా కోరుకుంటూ ఆ సనారీ విశ్వేశ్వరులు వీరికి అష్టైశ్వర్య భోగభాగ్యాదులతో పాటు ఆయురారోగ్యాలను ప్రసాదించాలని కోరుతూ...

మీ జనార్ధన శివాచార్య
శ్రీశర్వాణీశైవాగమ విద్యాపీఠం, తెనాలి.

## శ్రీశ్రీశ్రీ సనారీశ్వర పూజా విధానము

(సూర్యోదయమునకు పూర్వమే నిద్రమేల్కొని శుచియై సంధ్యావందనము గావించి, పూజామందిరము చేరి పీఠమందలి దైవప్రతిమలు శుభ్రము గావించుకొని స్థిర చిత్తుడై దేవతామూర్తులను పుష్ప, కుంకుమ పన్నీరు, గంధములతో అలంకరించుకొని దైవము కన్నా దిగువుగా నుండునట్లు దర్భాసనము వేసుకొని పద్మాసనాశీనుడై ప్రశాంతంగా కూర్చొండి (**ఓంకారము 5 సార్లు** చెప్పుకొని.)

**విభూతి మంత్రం**

**శ్లో॥ త్ర్యంబకంయజామహే। సుగంధింపుష్టివర్ధనమ్**
**ఉర్వారుకమివబంధనాత్। మృత్యోర్ముక్షియమామృతాత్॥**

లలాటంతు మహాదేవం॥ నాభించైవమహేశ్వరం॥ హృదయే, శంకరజ్ఞేయం। కంఠేచవృషభధ్వజం॥ భుజాగ్రేశూలపాణించ॥ తన్మధ్యేకామాంగనాశనం। కరాగ్రే దేవదేవేశం। కరౌద్వౌశివరుద్రంచ। కర్ణౌచైవమహేశ్వరం। బహిః కంఠేపశువతే। శిరశ్చతోసదాశివం। స్మరయేతానినామానిత్రిపుంద్రధారయేత్ క్రమాత్। (ఆయా శరీరభాగములందు విభూధినిధరించాలి)

**గంధధారణ :** గంధద్వారాన్ధురాధర్షాన్ నిత్యపుష్టాంకరీషిణీమ్। ఈశ్వరీగ్ం సర్వభూతానామ్ । తామిహోపహ్వయేశ్రీయమ్।(గంధాన్ని ధరించాలి)

**కుంకుమధారణ :** కుంకుమంశోభనందివ్యం। సర్వదామంగళప్రదం భక్త్యానేతం ప్రయచ్ఛిమి। గృహాణత్వం మహేశ్వరీ॥ (కుంకుమ ధరించాలి)

**భూమి శుద్ధి :** భూమిర్ధేనుర్ధరణ లోకధారణి। ఉధృతాసివరాహేణ, విష్ణేన శతబాహూనా॥ (తమలపాకులతో నీటిని ఆ ప్రదేశమంతా చల్లాలి)

**ఆసననమస్కారము**

**ఓం పృథ్వీత్వయాధృతాలోకాదేవీత్వంవిష్ణునాధృతా!**
**త్వఇ్చధారయమాందేవిపవిత్రంకురుచాసనమ్॥**(నమస్కరించి కూర్చోవాలి)

**భూశుద్ధి:** ఓం అ పవిత్ర:పవిత్రోవా సర్వావస్తాంగ తో పివా యస్మరేత్



విశ్వకర్మాణాం సభాహ్యాం భ్యంతర శుచిః, (పువ్వుతోగాని, ఆకుతోగాని తన చుట్లూ నీళ్ళు చల్లుకోవాలి,)

**గురుధ్యానం :** గురు బ్రహ్మ గురుర్విష్ణుః గురు దేవో మహేశ్వరః గురు సాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురవేనమః **(పూలమాలవేయునపుడు)** మల్లికాజాజికుసుమైశ్చంపకవకుళైరపి।శతపత్రకల్హారమ్ పుష్ప మాలాంకృతాం॥

**వాగ్దేవి ప్రార్ధన:** ఓం దేవీం వాచమ జనయన్త దేవాస్తాంవిశ్వరూపాః పశవోవదన్తి సానో మంద్రేష మూర్జం దుహానా ధేనుర్వా గస్మాను పసుష్టుతైతు, ఆయం ముహూర్త సుముహూర్తోస్తు ఏతత్ సుముహూర్తకాలే సూర్యాది నవగ్రహాణాం, ఉపగ్రహాణాం సర్వ గ్రహాణాం జన్మలగ్న, జన్మరాశి, నామరాశి, జన్మనక్షత్ర నామనక్షత్ర వశాత్ ఏఏ గ్రహాః ఏఏ రాశి స్తితౌ అత్యంత అనుకూల ఫలసిద్ధర్థ్యం శ్రీ అన్నపూర్ణ సహిత విశ్వేశ్వర దేవతా పూజాం కరిష్యే. (ఉంగరం వేలు పంచపాత్రలో ఉంచాలి).

అదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే.

**శ్లో॥ ఓం తచ్ఛం యోరావృణీమహే। గాతుం యజ్ఞాయ। గాతుం యజ్ఞపతయే దైవీం "స్వస్తిరస్తునః। స్వస్తిర్మానుషేభ్యః । ఊర్ధ్వం జిగాతుభేషజం శంనో అస్తుద్విపదే" శంచతుష్పదే॥ ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః**

**దీపారాధన**

**శ్లో॥ భో! దీపదేవీ రూపస్త్వం కర్మసాక్షి హ్యవిఘ్నకృత్ యావత్**
**పూజాం కరిష్యామితావత్వం సుస్తిరో భవ॥**

దీపారాధన ముహూర్తసుముహూర్తోస్తు
(అని దీపారాధన చేయాలి స్వామివారి ఫొటోకు 2వైపులా దీపములుండాలి నమస్కరించాలి).

**గణపతి ప్రార్ధన:** శుక్లాంబరధరం విష్ణుం,శశివర్ణం, చతుర్భుజం, ప్రసన్న వదనం ధ్యాయేత్, సర్వ విఘ్నోప శాంతయే॥(నమస్కరిస్తూ) ఓం, శ్రీం, హ్రీం క్లీం, గ్లౌం, గ్లం, గం గణపతయేనమః వరవరద సర్వజనం మేవశమానాయ స్వాహా (కనీసం 5 సార్లయినా ఈ మంత్రం చెప్పి పంచపూజలు చేయాలి.) యధాశక్తిజపంకుర్యాత్ ।

లంపృద్వీతత్వాత్మనే శ్రీ మహాగణాధిపతయేనమః గంధం పరికల్పయామి
హం ఆకాశతత్వాత్మనే శ్రీ మహాగణాధిపతయేనమః పుష్పం సమర్పయామి
యం వాయుతత్వాత్మనే శ్రీ మహాగణాధిపతయేనమః దూపమా ఘ్రాపయామి
రం వహ్నితత్వాత్మనే శ్రీ మహాగణాధిపతయేనమః దీపం దర్శయామి
వం అమృతతత్వాత్మనే శ్రీ మహాగణాధిపతయేనమః నైవేద్యం నివేదయామి

(ప్రసాదం పేరు చెప్పి పెట్టాలి)

సం సర్వాత్మనే శ్రీ మహాగణాధిపతయేనమః సర్వోపచార తాంబూలం సమర్పయామి (తాంబూలం లేక అక్షంతలు వేయవచ్చు)

(నమస్కరిస్తూ) విఘ్నేశ్వరా విఘ్ననాయకా నేను, నా కుటుంబ సభ్యులు సంకల్పించు ప్రతీకార్యము నిర్విఘ్నముగా నెరవేర్చు భగవాన్

**విశ్వకర్మ ప్రార్థన** (విభూతి పండును విశ్వకర్మగా భావించి)

ఓం విశ్వకర్మాదిశాం పతిస్సనః పసూన్ పాతుసోఽస్మాన్ పాతు తస్మైనమః

**శ్లో॥ జ్యోతిర్మయాకృతి విశాల వివేకరూప, విజ్ఞాన సృష్టి మయకారణ విశ్వకర్మ, అనాది మూర్తి పరదేవత పంచవక్త్ర పాలాం హ్యికా సృజనకర్తనమో నమస్తే॥**

(యివి లఘుపూజలుచేసుకోగల వారు యింకా వివరంగా చేసుకోవచ్చును.)

**పంచశక్తుల సహిత పంచబ్రహ్మల ప్రార్థన:**

ఓం శ్రీ మదాది శక్తి మనుబ్రహ్మ స్వరూపాభ్యాం ఉమామహేశ్వరాభ్యాం నమః
ఓం శ్రీ పరాశక్తి మయబ్రహ్మ స్వరూపాభ్యాం లక్ష్మీనారాయణాభ్యాం నమః
ఓం శ్రీ ఇచ్ఛాశక్తి త్వష్టబ్రహ్మ స్వరూపాభ్యాం వాణీహిరణ్యరూపాభ్యాంనమః
ఓం శ్రీ క్రియాశక్తి శిల్పిబ్రహ్మ స్వరూపాభ్యాం శచీపురంధరాభ్యాం నమః
ఓం శ్రీ జ్ఞానశక్తి విశ్వజ్ఞబ్రహ్మ స్వరూపాభ్యాం సంజ్ఞా భాస్కరాభ్యాం నమః

ఓం అగ్న్యయేనమః సర్వదేవతాభ్యాం నమః సర్వేభ్యో మహాజనేభ్యోనమః గృహదేవతాభ్యాం నమః మాతా పితృభ్యోనమః (తల్లితండ్రులు గతించిన వారు)(గణపతికి చెప్పినట్లుగా పంచపూజలు విరాట్ విశ్వకర్మ భగవాన్‌కు చేయాలి) (యిలా) లం పృధివీతత్వాత్మనే శ్రీ మహా విశ్వకర్మ దేవతాయై నమః గంధం పరికల్పయామి **ఆఖరున** ఓం



విశ్వకర్మ భగవాన్ నన్ను నా కుటుంబ సభ్యులను చల్లగా కాపాడు పితామహా శరణు శరణు శరణు (నమస్కరించాలి.)

**ఆచనమనము**

ఓం విశ్వకర్మణే స్వాహా", ఓం సనాతనాయస్వాహా" ఓం జగన్మయాయ స్వాహా" (ఉద్దరణితో తీర్థము చేతిని గోకర్ణముగా పట్టి 3 సార్లు తీసుకొనవలయును)

**భార్యకు యిచ్చేటప్పుడు**

ఓం "కేశవాయ స్వాహా"(అని చెప్పుకుని లోనికి తీసుకోవాలి, ఆనీరు కడుపులో బొడ్డువరకు దిగిన తరువాత మరల పైవిధంగానే)
"ఓం నారాయణాయ స్వాహా" (అనుకుని ఒకసారీ)
"ఓం మాధవాయ స్వాహా" (అనుకుని ఒకసారీ జలం పుచ్చుకోవలెను.
"ఓం గోవిందాయనమః" (అని చేతులు కడుగుకోవాలి).
"ఓంవిష్ణవేనమః"(నీళ్లుతాకి,మధ్యవ్రేలు, బొటనవ్రేళ్లతో కళ్లు తుడుచుకోవాలి)
"ఓం మధుసూదనాయనమః" (పై పెదవిని కుడినించి ఎడమకి నిమురుకోవాలి)
"ఓం త్రివిక్రమాయనమః" (క్రింద పెదవిని కుడినించి ఎడమకి నిమురుకోవాలి)
"ఓం వామనాయ నమః" ఓం శ్రీ ధరాయనమః (తలపై నీళ్లు చల్లుకోవాలి)
"ఓం హృషీకేశాయ నమః" (ఎడమచేతితో నీళ్లు చల్లాలి)
"ఓం పద్మనాభాయ నమః (పాదాలపై ఒక్కొక్క చుక్క నీరు చల్లుకోవాలి)
"ఓం దామోదరాయ నమః (శిరస్సు పై జలమును ప్రోక్షించుకోవలెను)
"ఓం సంకర్షణాయనమః" (చేతివ్రేళ్ళు గిన్నెలా వుంచి గెడ్డము తుడుచుకోవలెను)
"ఓం వాసుదేవాయ నమః" (వ్రేళ్లతో ముక్కును వదులుగా పట్టుకోవలెను)
"ఓం ప్రద్యుమ్నాయ నమః" "ఓం అనిరుద్ధాయ నమః (రెండు నేత్రాలు తాకవలెను)
ఓం పురుషోత్తమాయ నమః ఓం అధోక్షజాయనమః (రెండు చెవులు తాకవలెను)
"ఓం నారసింహాయ నమః",ఓం అచ్యుతాయ నమః" (బొడ్డును స్పృశించుకోవలెను)
"ఓం జనార్ధనాయ నమః" (చేతివ్రేళ్లతో వక్షస్థలం, హృదయం తాకవలెను)
"ఓం ఉపేంద్రాయ నమః (చేతికొనలతో శిరస్సు తాకవలెను)

"ఓం హరయే నమః" "ఓం శ్రీ కృష్ణాయ నమః" (కుడి మూపురమును ఎడమ చేతితోను, ఎడమ మూపురమును కుడిచేతితోను తాకవలెను)

**భూతోచ్చాటనము**

**శ్లో॥ ఓం ఉత్తిష్టంతు భూతపిశాచాః ఏతేభూమిభారకాః!**
**ఏతేషామ విరోధేనబ్రహ్మకర్మసమారభే**
**(అక్షంతలు వాసనచూచి ఎడమచేతి వెనుక వైపున వేసుకోవాలి)**

ప్రాణాయామాం

(ప్రాణాయామ అభ్యాసం ఉన్నవారు ఇక్కడ ఆచరించాలి తెలియనివారు ముక్కుపుచ్చుకొని మంత్రం చెప్పాలి)

**శ్లో॥ ఓం ప్రణవస్య పరబ్రహ్మఋషిః పరమాత్మాదేవతా**
**దేవీం గాయత్రీచ్ఛందః ప్రాణాయామే వినియోగః**

మంత్రం : ఓంభూః, ఓం భువః, ఒగ్ంసువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓగ్ం సత్యం, ఓం తత్స వితుర్వరే"ణ్యం, భర్గోదేవస్య ధీమహీదియోయోనః ప్రచోదయాత్ ఓం మాపోజ్యోతిరసో ఉ మృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్ (కుంభకంలో ఈ మంత్రాన్ని వీలైనన్ని సార్లు చెప్పాలి)

## ప్రధాన కలశ స్థాపనా విధి:

ప్రధాన కలశంలో ఉదకము పోయునపుడు:

మంత్రం॥ఓం ఆపోయిష్టామయోభువః ఓంతాన ఊర్జేతధాతనా
ఓం మహేరణాయచక్షుసే, ఓంయోవశ్శివతమోరసః
ఓం తస్యభాజయతేహనః ఓం ఉశతీరవమాతరః
ఓంతస్మాదరంగమామవో, ఓం యస్యక్షయాయజిన్వథః
ఓం ఆపోజనయధాచనః (కలశంలో నీళ్ళు పోసేది)

ప్రధాన కలశంలో తమలపాకులు ఉంచునపుడు:

మంత్రం ॥ఓంప్రవృష్టయజ్ఞాయజ్ఞేయజ్ఞేగ్ంహవిరజుషతాః॥
(5 తమలపాకులు గానీ, మామిడి ఆకులు గానీ కొసలు పైకివచ్చేటట్లుగా పెట్టాలి)



ప్రధాన కలశముపై కొబ్బరికాయ ఉంచునపుడు:

శ్లో॥ ఓం యాః ఫలనీర్యాఃఫలా2పుష్పాయాశ్చ పుష్పిణీః
బృహస్పతీ ప్రసూతాస్థానోముంచత్వగ్ంహసః

ప్రధాన కలశముపై వస్త్రము ఉంచునపుడు:

శ్లో॥ ఓంఇవంవస్త్రాణిపీవసావసాధేయివో రచ్చిద్రమంత్రవో హసర్గాః
అవాతిరతిమమృతాని విశ్వాఋతేనమిత్రావరుణాశచేధే

ప్రధాన కలశాన్ని పీఠముపై నుంచునపుడు:

శ్లో॥ ఓంఘటమూలేస్థితోబ్రహ్మ, ఘటార్ధేశక్తిదేవతా,
ఘటవామేచఋషయో ఘటార్ధేభైరవాదయః

ప్రధాన కలశాన్ని నమస్కరిస్తూ:

శ్లో॥ దిక్పాలకైర్వైనతేయమృగేంద్రయుక్తం, ఆధారమండప
షడోపరిపార్వతీస్థం, కూర్మాదిస్వర్ణమణిభద్రప్రలంభ
మానంసింహాసనందేవనరైశ్చ వంద్యం (నమస్కరించేది)

**సంకల్పము**

మమోపాత్త దరితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిస్య శ్రీ పరమేశ్వరప్రీత్యర్ధం, శ్రీ మహకాళీ దేవతా ప్రీత్యర్ధం, శ్రీ మహాలక్ష్మీ దేవతాప్రీత్యర్ధం, శ్రీ దుర్గాదేవతాప్రీత్యర్ధం, శ్రీ సరస్వతీదేవతాప్రీత్యర్ధం, శ్రీబాలాత్రిపురసుందరీ దేవతాప్రీత్యర్ధం, శ్రీ కామాక్షీదేవతాప్రీత్యర్ధం, శ్రీ గాయత్రిదేవతా ప్రీత్యర్ధం, శ్రీమీనాక్షీదేవతాప్రీత్యర్ధం, శ్రీలలితా దేవతాప్రీత్యర్ధం, శ్రీ రాజరాజేశ్వరీ దేవతా ప్రీత్యర్ధం పంచ భూతాది ప్రీత్యర్ధం, అదిత్యాది నవగ్రహదేవతా ప్రీత్యర్ధం ఇంద్రాది అష్టదిక్పాలకాది దేవతాప్రీత్యర్ధం నవభైరవప్రీత్యర్ధం శ్రీమహావిశ్వకర్మ రాజ్ఞేయప్రవర్ధమానస్య అద్యబ్రహ్మనిర్మిత ప్రపంచకమధ్యేప్రార్ధే శ్వేతవరాహకల్పే, వైవస్వత మన్వంతరే కలియుగే ప్రధమపాదే, జంబూద్వీపే, భరతవర్షే భరతఖండే మేరోర్దక్షిణదిగ్భాగే శ్రీశైలస్యఈశాన్యప్రదేశే కృష్ణా, గోదావర్యోః మధ్యప్రదేశే,

(స్వగృహే) సమస్తదేవతాసన్నిధౌ, అస్మిన్వర్తమానవ్యావహారిక చాంద్రమానేన శుభసంవత్సరే, శుభాయనే, శుభఋతౌ శుభమాసే శుభపక్షే శుభతిధౌ శుభవాసరే, శుభనక్షత్రే, శుభయోగే, శుభకరణే ఏవంగుణ విశేషణ విశిష్టాయాం, శుభాభ్యాం, శుభాద్యుదయ సుముహూర్తే శ్రీమాన్శ్రీమతః (గోత్రస్య, నామధేయస్య) ధర్మపత్నీసమేతస్యపుత్ర పౌత్రభివృధ్యర్ధం సత్య, ధర్మ, అర్ధ, కామ మోక్షాది పంచవిధఫలపురషార్ధ సిధ్యర్ధం సకలగ్రహ, గృహదోషనివారణార్ధం శ్రీ అన్నపూర్ణా సమేత శ్రీ విశ్వేశ్వర దేవతా ప్రీత్యర్ధం సనారీశ్వరవ్రతం కరిష్యే తదంగ కలశారాధనం కరిష్యే ( ఉంగరం వేలు పంచపాత్రలో ఉంచాలి చెప్పగల వారు పంచాంగం ప్రకారం సంవత్సర తిధి వార నక్షత్ర యోగ కరణములు చెప్పాలి)

**కలశప్రార్థన :** (కలశానికి గంధంరాశి కుంకుమ బొట్టు పెట్టి)

**శ్లో ॥ ఓం ఘటమూలేస్తితే బ్రహ్మా ఘటార్ధే శక్తి దేవతా।**
**ఘటవామే చబుషయో ఘటాంతే భైరవాదయః॥**

(ధేను, మత్య కూర్మముద్రలు చూపించి నమస్కరించాలి)

నదీప్రార్థన

**శ్లో ॥ గంగేచ, యమునే, కృష్ణే, గోదావరి, సరస్వతీ,**
**నర్మదే, సింధు, కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు॥**

ఆయాంతు శ్రీ సనారీశ్వర పూజార్ధాం మమ దురితక్షయ కారకాః , కలశోదకేనపూజాద్రవ్యాణి సంప్రోక్ష్య దేవం, ఆత్మానంచ సంప్రోక్ష్య॥ (పంచపాత్రలోజలం దేవతలపై పూజాద్రవ్యాలపై తన శిరస్సుపై చల్లాలి) (అరచేతిలో తమలపాకు పట్టుకొని దేవతామూర్తులను యంత్రములను మూసి అభిమంత్రించ వలయును)

**ప్రాణప్రతిష్ఠ :** ఓం అసునీతే పునరస్మా "సు చక్షుః పునః ప్రాణ మిహనో" "దేహిభోగం" జోక్పశ్యేమ సూర్యముచ్చరంత। మనుమతే మృడయా"న స్వస్తి॥ అమృతంవైప్రాణాః అమృతమాపః ప్రాణానేనయ ధాస్థానము పహ్వయతే। పునర్మాయాత్మ పునరాయురాగాత్, నప్రాణా రూపమాగాత్ వైశ్వానరోరస్మిభిః॥

**అమృతస్వరూపం** (ఇది 5 గానీ, 7 గానీ, 21సార్లు గానీ చెప్పాలి)



**ఘంటానాదం :** ఓం ఆగమార్థంతు। దేవానాం ।గమనార్థంతు ।రక్షసామ్ కురుఘంటారవం తత్రదేవతాహ్వాన లాంచనామ్॥ (పూజించు దేవతలను మందిరములో గల మూర్తులలోకి ప్రవేశించినట్లు భావించాలి) (కుడిచేతిలో అక్షింతలు తీసుకుని "కనులు మూసి భృకిటి దగ్గర పట్టుకొని)"

**స్తవ శ్లోకములు**

శ్రీభాసం, శ్యాస్థిర బలయుతం, సిద్ధ తంత్ర ప్రయత్నమ్ బోధాఘఘ్నం, బుధమననిపుణం, పుణ్యమోఘ ప్రశస్తమ్ ద్వేభావజ్ఞం దివిజమునివరం, దీనరక్షోస్తుపోష్యమ్ సాభాలీథంసరసగుణమనః సర్వదాహన్నమోస్తు.

పాహిపాహి సనారీశా, పాహిపాహి మునీశ్వరా మమ యన్త్రార్చనం దేవా, బ్రూహిమేలోక తనాయకా

శృణుపార్వతివక్ష్యామి యంత్ర మంత్రార్చనా విదిః ఆరోగ్యమమితా యుష్యమ్, ఆనన్దం ఆత్మదర్శనమ్

భూవశ్యం భోగసంప్రాప్తి,భుక్తిముక్తి ప్రదాయకమ్ విద్యా వశ్యమ్ విషన్నశ్యమ్, వివిధాగమకోవిదమ్

ఆత్మజ్ఞాన మహాజ్ఞానం విజ్ఞానం విధిసాధనమ్ రోగారిష్ఠం, జ్వరంహన్తి, శత్రు సంతతి వినాశనమ్

పూజా తంత్రం పునశ్చర్యా, ధ్యానమానస సయ్యమా మానవానాం ప్రయత్నేన యిష్టకామ్యార్థ సిద్ధయేత్ (అక్షింతలు తన శిరస్సు పైన అక్కడ ఉన్న అందిరి శిరస్సుల పైన వేయాలి)

ఓం అస్య శ్రీసనారీవిశ్వేశ్వర మహామంత్రస్య విశ్వేశ్వర ఋషిః అనుష్టుప్ఛన్దః శ్రీ సనారీ విశ్వేశ్వర దేవతా ఓం బీజం, హ్రీం శక్తిః స్వః ఇతి కీలకం మమ సనారీశ్వర ప్రసాద సిద్ధర్థే జపే వినియోగః

**కరన్యాసః** ఓం హ్రీం అంగుష్ఠాభ్యాంనమః ఓం శ్రీం తర్జనీభ్యాం నమః ఓం ఐం మధ్య మాభ్యాం నమః ఓం క్లీం అనామికాభ్యాం నమః ఓం సౌః కనిష్టికాభ్యాం నమః ఓం స్వః కరతలకరపుష్ఠాభ్యాంనమః

**హృదయాదిన్యాసః** ఓం హ్రీం హృదయాయ నమః ఓం శ్రీం శిరసేస్వాహా॥

ఓం ఐం శిఖాయవౌషట్ ఓం క్లీం కవచాయహుం ఓం సౌః నేత్రత్రయాయ వౌషట్ ఓం స్వః అస్త్రాయఫట్ ఓం భూర్భువస్సు వరోమితిదిగ్బంధః (ఆయాఅవయములుచూపించిచూపుడు వ్రేళ్ళు మెలికవేసి పెట్టాలి.)

**ధ్యానం :** శ్రీ చందనం భసిత కుంకుమ భూషితాంగమ్ వామాన్క భర్తృకర భూషవిలీన సంస్తాపీతాంబరం కనకఘట్టన రత్నపీఠా వ్యాఖ్యాభయావరద హస్త సుభక్తపాలే (నమస్కరిస్తూ)

**దర్శనం :** ఓం, ఓం, ఓం, హ్రీం, హ్రీం, హ్రీం, శ్రీం, శ్రీం, శ్రీం, క్లీం, క్లీం, క్లీం, సౌః,సౌః సౌః. ఐం, ఐం,ఐం, ఓం దర్శనం, దర్శనం, దర్శనం, దేహి, దేహి, ఆవాహయ, ఆవాహయ, మమసాన్నిధ్యవాసినీం సర్వప్రకాశనీం. సచ్చిదానంద స్వరూపిణీం, స్వస్వరూప దర్శనం దేహిదేహి వౌషట్ వౌషట్ మమా భీష్టంకురుకురు. ఐం ఐం,ఐం, సౌః, సౌః. సౌః, క్లీం, క్లీం, క్లీం శ్రీం, శ్రీం, శ్రీం, హ్రీం, హ్రీం, హ్రీం లోకమాతా ఓం, ఓం, ఓం, శ్రీ సనారీశ్వరాయ నమః దర్శనం కురు కురు శ్రీఘ్రం కురుకురుగురుదేవా.

మూల మంత్రము :

**ఓం, హ్రీం, శ్రీం, ఐం. క్లీం, సౌః, సౌః, క్లీం, ఐం, శ్రీం,హ్రీం, ఓం**

(108 సార్లు జపం చేయగలిగినంతసేపు జపించి) యధాశక్తి జపంకుర్యాత్

1) తే॥ పరమ పాంచాల, పావనభక్తరక్ష, బ్రహ్మతేజోప్రభావ,సంపాద్యవిభవ । పార్వతీనాధ, మౌని సంభావ్యనిరత, పాహిసర్వేశ, విశ్వేశబ్రహ్మమూర్తి॥

గీ॥ మమ్ము సనారీశ్వర గరులిమ్ముగ కామ్యముల నొసగియిల బ్రోచుట సిద్ధమ్మని నమ్మిన మనమున సమ్మతిగా వేడి మీకు సాగిలపడితిన్

(సాష్టాంగ నమస్కారం చేయాలి)

**2) ఆవాహన:** ఓం శ్రీ సనారీశ్వరస్వామినేనమఃఆవాహయామి, స్తాపయామి, పూజయామి (అక్షంతలు వేసి నమస్కరించేది)



ఆసనం

**3) శ్లో॥ ఓం దిక్పాలకైర్వైనతేయ మృగేంద్రయుక్తం ఆధారమంటపషడోపరి॥ పార్వతీస్థం,కూర్మాది స్వర్ణమణిభద్రప్రలంబమానం సింహాసనందేవనర్షైవంధ్యం॥**

(ఓం సనారీశ్వరాయనమః నవరత్నఖచిత సువర్ణదివ్యసింహాసనం సమర్పయామిస్థిరాసనంకురు (అక్షంతలు వేసి నమస్కరించేది)

**4) పాద్యం : శ్లో॥ ఓంనమోస్త్వనంతాయసహస్రమూర్తయే సహస్ర పాదాక్షి శిరోరు బాహువే,సహస్రనామ్నేపురుషాయశాశ్వితే సహస్ర కోటియుగధారిణేనమః**

అన్నపూర్ణాసమేతవిశ్వేశ్వరస్వామినేనమఃపాదయోఃపాద్యం సమర్పయామి (నీటిచుక్కను క్రింద వదలాలి)

**5) అర్ఘ్యం:** ఓం శ్రీఅన్నపూర్ణాసమేతవిశ్వేశ్వరస్వామినే నమః హస్తయోఃఅర్ఘ్యం సమర్పయామి (నీటిచుక్క వదలాలి)

**ఆచమనీయం:** ఓం శ్రీ అన్నపూర్ణాసమేత విశ్వేశ్వరస్వామినే నమః ముఖేఆచమనీయంసమర్పయామి (నీటిచుక్కవదలాలి)

**6) శుద్ధోదకస్నానం:** ఓం ఆపోహిష్టామయోభువః ఓం తాన ఊర్జేదధాతన ఓం మహేరణాయ చక్షసే, ఓం యోవశ్శివతమోరసః, ఓం తస్యభాజ యతేహనః, ఓం ఉశితీరివమాతర, ఓం తస్మాదరంగమామవో ఓం యస్యక్షయాయ జన్వదః ఓం ఆపోజనయధాచనా॥ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః శుద్ధోదకస్నానం సమర్పయామి (తమలపాకుతో నీటిచుక్కను వదలాలి.)

**7) వస్త్రం :** ఓం ఇవం వస్త్రాణి పీవసావసాధేయివో, రచ్చి ద్రామంతవో హసర్గాః అవాతి, రతిమమృతాని, విశ్వార్తైన మిత్రావరుణాశచేధే॥

ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః వస్త్రయుగ్మంసమర్పయామి. (వస్త్రాలు లేకపోతే అక్షంతలువేసిన నమస్కరించేది)

**8) యజ్ఞోపవీతం :** యజ్ఞోపవీతం పరమంపవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్ ఆయుష్యమగ్ర్యం ప్రతి ముంచశుభ్రం యజ్ఞోపవీతం బలమస్తుతేజః ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః యజ్ఞోపవీతం సమర్పయామి. (యజ్ఞోపవీతంలేకపోతే అక్షింతలు వేయాలి)

**9) విభూతి :** శ్రీకరంచ పవిత్రంచ శోకరోగనివారకమ్ లోకంవశీకరం పుణ్యభస్మం త్రైలోక్యపావనమ్ (ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినే నమః విభూతి సమర్పయామి.)

**10) బిల్వపత్రం :** ఓం త్రినేత్రం త్రితయ బిళ్వం త్రిజన్మావర్త రక్షణం, సర్వపాపక్షయో భక్తాతులసీయుక్తం సమర్పితం.(ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః తులసిపత్రం సమర్పయామి.

**(తులసిగానీ, మారేడు పత్రంగానీ వేసి నమస్కరించేది.)**

**11) గంధం :** ఓం గంధద్వారాన్ దురాధర్షాం నిత్యపుష్టాం కరిషిణీం ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయేశ్రియమ్ (ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః శ్రీగంధం సమర్పయామి)

**12) పుష్పమ్ :** ఆయనేతేపరాయణేతే దూర్వారోహన్తు పుష్పిణీ హదాశ్చ పుండరీకాణీ సముద్రస్య గృహాఇమే (ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః పుష్పం సమర్పయామి)

**13) ఆభరణం :** ఓం హిరణ్య రూపస్య హిరణ్య సందృగపాన్న పాత్యేతుహిరణ్య వర్ణః హిరణ్య యాత్పర్యోనేర్ని షద్యాహిరణ్యాదాతదద్యన్న మస్మైః (ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః నవరత్న ఖచిత సువర్ణదివ్యాభరణం సమర్పయామి) అక్షంతలు వేసి నమస్కరించాలి.

**14) అధాంగపూజ :**

## శ్రీ శ్రీశ్రీసనారీశ్వర అధాంగపూజ:

| | | |
|---|---|---|
| 1. | ఓం సుభక్తసేవితాయనమః | పాదౌ పూజయామి |
| 2. | ఓం జీవన్ముక్తి ప్రసాదితాయనమః | జంఘేపూజయామి |
| 3. | ఓం వికృతికన్యకుసౌందర్యప్రసాదితాయనమః | జానునిపూజ యామి |
| 4. | ఓం సర్వద్రష్టప్రాణదాతాయనమః | ఊరుంపూజాయామి |
| 5. | ఓం నవపాషాణ హరాయనమః | గుహ్యంపూజయామి |
| 6. | ఓం శత్రుబాధనివారణాయనమః | కటింపూజయామి |
| 7. | ఓం హైమవతీ మాంగల్య రక్షణాయనమః | నాభింపూజయామి |



| | | |
|---|---|---|
| 8 | ఓం మొదలియార్ మహావ్యాధినివారణాయనమః | హస్తౌపూజయామి |
| 9. | ఓం పక్వాహారవిసర్జితాయ నమః | ఉదరంపూజయామి |
| 10. | ఓం ఆత్మజ్ఞాన ప్రభోధితాయనమః | హృదయంపూజయామి |
| 11. | ఓం పంచశిల్ప నిర్మాత్రేయనమః | భుజౌపూజయామి |
| 12. | ఓం వామాంక బాల ప్రదర్శనాయనమః | ముఖం పూజయామి |
| 13. | ఓం పంచాననకులోద్ధారకాయనమః | కంఠంపూజయామి |
| 14. | ఓం త్రినేత్ర ప్రదర్శనాయనమః | నేత్రం పూజయామి |
| 15. | ఓం అష్టాదివర్ణ శిష్యగణాయ నమః | లలాటంపూజయామి |
| 16. | ఓం ఆశ్రితజనసంరక్షాయనమః | శిరఃపూజయామి |
| 17. | ఓం భుక్తిముక్తిప్రధాతాయనమః | మౌళింపూజయామి |
| 18. | ఓం సాక్షాత్ పరమ శివావతారాయనమః | సర్వాణ్యంగానిపూజయామి |

(సంవాదమందలి శ్రీ సనారీ విశ్వేశ్వరనామ అష్టోత్తర శతకేతనామావళి చెప్పుకోవచ్చును.)

### 15. శ్రీ సనారీ అష్టోత్తర శతకేతనామవాళి

(నామాలకు ముందుగా ఓం, చివర నమః చెప్పుకొనవలయును)

ఓం శ్రీ లోకదేశికాదేవాయ నమః
శ్రీ గురుప్రభవే
శ్రీ పురుషాయ
అనంతాయ నమః
ఆగమాకృతయే
కవుళార్చనహితాయ
మకారపంచభోజ్యాయ
సృష్టికర్తాయ
ఆహవనీయబ్రహ్మాగ్నయే
శక్తిరూపాయ **10**
శివాకారాయ
శివసంభవమూర్తయే
విద్వేషనాశనాయ
సర్వభూతగణేశాయ
జగన్నిర్మాణకర్తయే
ఓం ఆత్మపూజా నిదర్శనాయ నమః
నానారత్నశిరోమకుటాయ
శుద్ధనిర్గుణ, గోచరాయ
ఓం హంసనిశ్చలసాధనాయ నమః
రాగస్వరూపాయ **20**
రమ్య సంసారసాధనాయ
కాంతాయుక్తాయ
బహుమంగళసంధానాయ
అంగనాంగార్చనయుక్తాయ
శ్రీ పురుషవిద్యరూపాయ
భంగనాశ పదోల్లాసాయ

సకలప్రియాయ
సకలోర్వీమనోహరాయ
సత్యసాగరసాధనాయ
మృత్యుంజయాయ **30**
లాంబికా యోగధారియే
శాంభవీముద్రలక్షాయ
శాశ్వతానందవిగ్రహాయ
క్షీరశైలాంతరస్థితాయ
పద్మపత్రాక్షివీక్షణాయ
నామపారాయణప్రీతాయ
నటప్రియాయ
యక్షగానవినోదినే
సర్వాంగారాధనదేవాయ
శ్రీరూపార్చనసంతుష్టాయ **40**
సర్వతంత్రప్రతాపాయ
పంచాననకులప్రసూతయే
మహావాఙ్మయహృద్ఘోషాయై
అగ్రబ్రహ్మసనేసంస్థాయై
ఓం ఆజ్ఞేయలోచనాయ నమః
రాజ్యలక్ష్మినివాసియే
కారణాత్మవిచారణాయ
కలిదోషవినాశాయ
ఖేచరీలక్ష్యసాధనాయ
మాయామోహినితంత్రాయ **50**
సర్వవర్ణార్తరక్షణాయ
పంచతత్వాత్మనిశ్చలాయ
నిఖిలాగ్రస్థిరాసనాయ
కోటిలింగేశ్వరస్థానాయ
ప్రేతమోక్షప్రదాయకాయ
సర్వయజ్ఞమయమూర్తియే
త్రిమలామల శోధాయ
ముద్రసాధన సంరక్షాయ

పండితారాధ్యయ
జ్ఞానా జ్ఞానపరిష్కారాయ **60**
మంతగపుత్రికారాధ్యాయ
మధుతర్పణసంతుష్టాయ
పాయసాన్నాహుతి ప్రీతాయ
యోగీశ్వరార్చనయుక్తాయ
క్షితిలోకభయంకరాయ
భక్తార్తరక్షణోత్సాహాయ
ప్రాణవాయు నిరోధాయ
భోగయోగ్యప్రదాయకాయ
ద్వయారాధన సంయుక్తాయ
సాధ్యా సాధ్య విసాధనాయ 70
వ్యాఘ్రచర్మాంగభూషణాయ నమః
ఓం లింగనిర్మాణదాయకాయ నమః
లింగస్థాపన సంరక్షాయ
లింగకూటార్చనహితాయ
పంచతత్వ ప్రవర్తనాయ
ప్రపంచ సాంఖ్య సంయోగాయ
వశ్యసాధన మన్మధాయ
మానినీ మోహనాకృతయే
కర్మరక్షణసాధనాయ
కర్మప్రాబల్య ఉద్భూతాయ 80
అద్భుతచారిత్రాయ
వశ్యావశ్యవ శంకరాయ
వేదవేదాంగలక్షణాయ
ఆనందాబ్జపూజితాయ
భూతలక్ష్యార్ధసాధనాయ
త్రిపురభూషణాయ
కళాశాస్త్రవిశారదాయ
బిందుపూర్ణమనోహరాయ
నాదరూపాయ



శ్రీ శైలాగ్రశిరస్సం స్థానాయ
సిద్ధమూర్తయే 90
అజాఫలలభక్షణాయ
మలత్రయవిశోధనాయ
త్రిఫలల భక్షణోద్యుక్తాయ
దివ్యజ్ఞాననిదర్శనాయ
శుద్ధతులసీదళప్రియాయ
భూతలక్ష్యార్ధసాధనాయ
పుణ్య శ్రవణ కీర్తనాయ
క్షత్రియాన్వయ భూషాయ

చతుర్వేదహితావర్తిన్యై 100
చాతుర్య గుణ సంపన్నాయ
విషదోషనివారణాయ
బహు విద్యాధిపాయ
హ్రీంకార వర్తనాధ్యక్షాయ
అమ్బరామ్బరాయ
కమండలధారియే
అమితైశ్వర్యపాలాయ
ఓం సనారీశ్వరాయ నమః 108

ఓం, హ్రీం, శ్రీం, చిద్విలాసాయై నమః, ఓం సర్వలోకజగద్గురవే నమః
ఓం, హ్రీం, శ్రీం, ఐం, క్లీం, సౌః, భం, భం, మహా దేవ గురు బ్రహ్మార్పణమస్తు

శ్లో॥ **వామేపార్వతి మారుతాత్మజపురోభాగస్తపార్శ్వద్వయే**
**ప్రేమోద్భూతమహాబుషిమునిగణాః గాన్యాగ్రవేదాగమాః**
**చిన్ముద్రాం కితశూలఫాలమభయాస్వర్ణోపవీతోజ్వాలాః**
**మాలాకుండలనూపురాంగభశితౌపాహీసనారీపతే॥**

**పరిమళద్రవ్యం:** సుగంధం, శీతలం, శుభ్రం, నానా సుగంధ సమన్వితం సనారీ ప్రీత్యర్థం తవదేవదేవేశీత్వామధ్యప్రతిగృహ్యతామ్॥

(అత్తరు , సెంటు, పన్నీరు, దేవతలపై చల్లాలి)

(కుంకుమ పూజ చేస్తే)

శ్లో॥ **శ్రీమహాదేవిదేవతా భద్రేసర్వమంగళం మంగళే౹**
**లసత్కుం కుమచూర్ణేన పూజయామి ప్రసీదమే.॥**

ఓం శ్రీ అన్నపూర్ణాసమేత విశ్వేశ్వరస్వామినే నమః
కుంకుమ పూజాం సమర్పయామి.

(పసుపు పూజ చేస్తే)

శ్లో॥ **ఓం గౌరీ మిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీసా**
**చతుష్పదీ అష్టాపదీ నవపదీ బభూవషీ సహస్రాక్షరాపరమేవ్యోమన్**

ఓం శ్రీ అన్నపూర్ణాసమేత విశ్వేశ్వరస్వామినే నమః
శ్రీ సనారీశ్వర ప్రీత్యర్థం పసుపు పూజాం సమర్పయామి.

(పుష్పాలతో పూజ చేస్తే)

శ్లో॥ **ఆయనేతే పరాయణే దూర్వారోహన్తు పుష్పిణీః ౹**
**హ్రదాశ్చపుండరీకాణి సముద్రస్యగృహాఇమే॥**

ఓం శ్రీ అన్నపూర్ణాసమేత విశ్వేశ్వరస్వామినే నమః
శ్రీ సనారీశ్వర ప్రీత్యర్థం పుష్ప పూజాం సమర్పయామి.

**(అక్షితలతో చేస్తే)**

శో॥ **ఓం అర్చత ప్రార్చత ప్రియ మేధాసో అర్చత!**
**అర్చంతుపుత్రకా ఉతపురన్న ధృష్ణర్చత ॥**

ఓం శ్రీ అన్నపూర్ణా సమేత విశ్వేశ్వరస్వామినే నమః
శ్రీ సనారీశ్వర ప్రీత్యర్థం అక్షతాం పూజాం సమర్పయామి.

**16) ధూపం:** ఓం గుగ్గిలం ఘృతసంయుక్తం కున్కుమంమహిసాక్షికం ఆఘ్రేయో స్సర్వదేవానాం ధూపోయాంప్రతిగృహ్యతాం॥శ్రీ సనారీశ్వర ప్రీత్యర్థం ధూపమాఘ్రాపయామి

ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః ధూపమాఘ్రాపయామి

**17) దీపం:** ఓం ఉద్దీప్యస్వజాతవేదోపఘ్నం నిర్మృతిం మమ పశూగుం శ్యామాహ్యామావహ జీవనంచ దిశోదిశః॥ శ్రీ సనారీశ్వర ప్రీత్యర్థం దీపందర్శమాయి

ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః దీపం దర్శయామి

**18) నైవేద్యం:** ఓం భూర్భువస్సువః ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్యధీ మహీ ధియోయోనః ప్రచోదయాత్ పరోరజసేసావధోం. సత్యంత్వర్తేన (రాత్రికి ఋతంత్వాసత్యేన) పరిషించామి, అమృతమస్తు అమృతోపస్త రణమసి అమృత మస్తునే అమృతమస్తు (మహానైవేద్యానికి నీళ్ళు చుట్టూ జల్లి తమలపాకు తో నీటిని నివేదనాపదార్థములపై జల్లుతూ. శ్రీ సనారీశ్వర ప్రీత్యర్థం

ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః (పేరు చెప్పి) నైవేద్యం సమర్పయామి

**19) తాంబూలం:** శ్లో॥ పూగీ పలైస్సకర్పూరై ర్నాగవల్లీ దళైర్యుతం ముక్తాచూర్ణ సమాయుక్తంతాంబూలం ప్రతిగృహ్యతామ్॥ శ్రీ సనారీశ్వర ప్రీత్యర్థం

ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః తాంబూలం సమర్పయామి (తాంబూలం లేకుంటే అక్షతలు ఉంచాలి)

**20) నీరాజనం:** శ్లో॥ హరిఃఓం ఆర్థం జ్వలతీ జ్యోతీరహిమస్మీ జ్యోతిజ్వలతీ బ్రహ్మాహమస్మియోహమస్మి బ్రహ్మాహమస్మి అహమస్మి బ్రహ్మాహమస్మి అహమేవా హం మాంజుహోమిస్వః ॥శ్రీ సనారీశ్వర ప్రీత్యర్థం

ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః ఆనంద కర్పూరనీరజనం సమర్పయామి (కర్పూరం వెలిగించి గంట వాయిస్తూ స్వామికి చూపాలి)



## శ్రీ సనారీశ్వర వ్రతారంభచరిత్ర

శ్రీ మదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండును. దేవాది దేవుండును, నాదబిందుకళాతీతుండును, సాక్షాత్పరమశివావతారుండును, అష్టాంగయోగములు, రసవాద ప్రక్రియలును, అష్టసిద్ధులను పొంది మహాతపః సంపన్నులై నవపాషాణములను జీర్ణించుకొని తన మూత్ర శుద్ధిచే లోహములను అపరంజి గావించి **"సనారీ విశేశ్వర సంవాదంబు** రచియించి, శక్తిని, స్వాధీనముగావించుకొని "సనారీ" యైన జగద్గురువులు అన్నపూర్ణా సమేత విశ్వనాధుని వ్రతం సనారీశ్వర వ్రతం మొదలియార్ అత్యంత భక్తిశ్రద్ధలతో ప్రతీ అమావాస్య పౌర్ణమి తిధులందు జీవితాంతం ఆచరించెను.

ఒకనాటి పూర్ణిమ సోమవారం చంద్రోదయకాలమున మొదలియార్ పుత్ర, పౌత్ర, బంధు, మిత్రాదులను రావించి సతీసమేతడై సనారీశ్వర వ్రత మాచరించుచుండగా "తన మనుమలు" తాతా నీవు నెలకు రెండుసారిట్లు వ్రతమాచరించుటకు కారణమేమిమనగా?

మొదలియార్ ఆచటి బంధుమిత్రాదులనుగాంచినాయనలారా! సనారీ కాలజ్ఞాన ప్రకారం భవిష్యత్తులో జరుగబోవు ప్రళయములు, వింతలు, విపత్కరపరిణామము కలి ప్రభావముచే కలుగుశారీరక, మానసిక, ఆర్థిక పరిస్థితుల నుండి రక్షణకై దుర్భిక్షములు బడయక, విపత్తులు తొలగి సర్వత్రాజయము కలిగి ఆయురారోగ్య భోగభాగ్యములతో వంశవృద్ధికలిగి వర్ధిల్లుటకు "సనారీశ్వర వ్రతమును" త్రికరణశుద్ధిగా ఆచరించవలయును ఎవరు ఈ వ్రతమును 21 సార్లు చేయుదురో వారు ఆయురారోగ్యములతో సత్సంతానవంతులై పూర్ణాయుష్తో వర్ధిల్లి అంత్యమున ఆ దేవాదేవుని యందు ఐక్యమగుదురు. సందేహపడక ఆచరించిన సత్ ఫలితములు పొందగలరు.

అచటగల వారందరూ ఈ వ్రతమాచరించినవారి చరిత్రతెలుపమని కోరగా? మొదలియార్ సనారీశ్వరుని ప్రార్థించియిట్లుచెప్పెను. భక్తుల కష్టాలు తీర్చుటకు భగవంతుడు యిప్పటివరకు ఎన్నో అవతారములు దాల్చాడు. దానికి నిదర్శనము అష్టాదశపురాణముల, భారత భాగవత, ఇతిహాసములు.

ఈ క్రమములో సాక్షాత్ పరమశివుడు 17వ శతాబ్ధిఅంతములో శ్రీకాకుళంజిల్లా పాలకొండ గ్రామమున విశ్వబ్రాహ్మణకుల దీపకుడు శివపూజాదురంధరులగు, సింహాద్రి గౌరమాంబవీరాచార్యుల తపఃఫలంగా విశ్వబ్రాహ్మణకులమున విశ్వనాధునిగా జన్మించి, బాల్యమునుండి అనేక మహిమలు జూపుతూ యవ్వనమందు శక్తిస్వరూపిణియగు అన్నపూర్ణాంబను వివాహమాడి "రాజయోగియై" కలిమాయతో కొట్టుమిట్టాడు మానవుల నుద్ధరింప కంకణధారియై, పరమేశ్వరుడు పార్వతీదేవికి తన అర్ధశరీర మిచ్చినట్లుగా! తన అర్ధాంగిని తనయందు ఐక్యముచేసుకొని "సనారీ"యై దేశసంచారముచేయుచు పాలకొండనుండి మద్రాసు వరకూ కాలినడకన పయనిస్తూ మార్గమందలి పల్లెపట్టణ, హరిజన, గిరిజనవాడలందు సనాతనధర్మములు, ఆధ్యాత్మిక విషయములు యోగసాధనా పద్ధతు లెరింగించుచు భక్తులకు గల సందేహములు తీర్చుచూ, అనేక మహిమలు జూపుతూ, పామరులకర్ధమగు రీతిలో పిపీలకాది బ్రహ్మపర్యంతముగల జీవరహస్యములు గురుశిష్య సంబంధములు, అష్టాంగయోగములు, అణిమాధ్యష్టసిద్ధులు పొందు మార్గములు, పాదరసబంధం, స్వర్ణయోగము, మానవుడే మాధవుడుకాగల యోగసాధనాపద్ధతులు తెల్పుచూ.

ఈ విషయములన్నియూ "సనారీ సంవాద" మందు రచించుతూ గ్రంధ ముద్రణ చేయించుటకు చెన్నపురి బయలుదేరి మార్గమందలి బొబ్బిలి, విజయనగర ప్రభువులకు రాజగురువుగా కొన్నాళ్ళుండి వారికి, రాజ్య



ప్రజలకు సనాతన ధర్మములు, యోగసాధనా పద్ధతులు ఉపదేశించి ఆయా రాజ్యప్రజలను పునీతులను గావించి, బొబ్బిలివారికి, పూసపాటివారికి, నాటినుండి నేటివరకు యిలవేల్పుగా పూజలందుకొనుచూ ఆయా రాజ్యములు సస్యశ్యామలమై శాంతిమార్గమున జీవించుటకు, సత్ కీర్తితో వెలుగొందుటకు కారకులైరి.

మాఘకార్తీకవైశాఖ మాసములను మూలమాదియు
శ్రవణాంతమునకు శుక్రవార సోమవారములు వరుస
నిత్యము ననుపూజింపువారికి మోక్షమిత్తు ॥ నని

నాటినుండి తెలుగు, తమిళ, మళయాళ, కన్నడ ప్రజలతో పూజింప బడుచున్నారు.

## ప్రధమాధ్యాయం

స్వామివారు రాజ మహేంద్రిలోదునియా వేసిన రోజులలో స్వామివారి బాల్యంలో కురూపియగు విప్రకన్యనుసౌందర్యవతిగా ఆశీర్వదించగా ఆమెకు సుందరియను పేరు శాశ్వతమయ్యెను. ఆమె సౌందర్యమునకు ముగ్ధుడైన కామేశ్వరశర్మ సుందరిని వివాహమాడగా వారి అన్యోన్య దాంపత్యమునకు ముగ్గురు పుత్రికలు యిద్దరు పుత్రులు కల్గిరి. కామేశ్వరశర్మ రాజ మహేంద్రిలో దేవాలయ అర్చకత్వము చేయుచూ చాలీ చాలని బత్తెముతో కాలము గడుపు చుండెను. ఒకనాడు సుందరి కామేశ్వరశర్మతో నాధా! తమ దివ్యవాక్కుతో నాకీ రూపమును ప్రసాదించినట్టి పురాణపురుషులు సనారీ వారు కోటి లింగాలరేవు వద్ద బసచేసిరని వింటిని. వారిని మనము దర్శించి, యింటికి ఆహ్వానించిన ఈ దుస్థితి తొలగిపోవునని చెప్పగా, కామేశ్వర శర్మ సంతోషముతో భార్యను వెంటనిడికొనిస్వామి వారి దునియా కడకుపోయి సాష్టాంగదండ ప్రణాముల నాచరించి సాదరముగా యింటికి ఆహ్వానించి, అతిధిపూజలు గావించుతూ తమకున్నంతలో ఏ లోటు

రాకుండా సపర్యలుచేయుచూ, యోగవిద్యా రహస్యములు తెలుసుకొనుచూ తన హీనస్థితితెలుపగా! స్వామివారు ఆ దంపతులు భక్తి ప్రపత్తులకు సంతోషించి నాయనా! మీకు త్వరలో మంచి రోజులురానున్నవి, నేనందులకే మీ ఆతిధ్యము స్వీకరించు చుంటిని. రేపు బ్రహ్మ ముహూర్తమున మీరు మేల్కాంచి స్నాన సంధ్యానుష్ఠానములు పూర్తి చేసుకుని, గృహ ఈశాన్యభాగమున వేదిక నేర్పరచుకొని సిద్ధంగా యుండుడని స్వామివారు నిత్యానుష్ఠానమునకు పోయిరి.

ఎప్పుడూ చాలీచాలని బత్తెములనిచ్చు ధర్మకర్త కామేశ్వరశర్మ కు ఆనాటి వ్రతమునకు కావలసిన సంబారములన్నియూ సమృద్ధిగానిచ్చెను. ఆ దంపతులు తామున్న పూరిపాక ఈశాన్య భాగమున గోమయముతో అలికి వేదిక నేర్పరచి బియ్యపుపిండి, పసుపు, కుంకుమ పుష్పములతో నలంకరించి, పూజాద్రవ్యములతో వారిరువురూ వ్రతమాచరించుటకు సిద్ధంగా యుండిరి.

ఉదయాన్నే స్వామివారు బ్రహ్మపీఠము నలంకరించిపూజను ప్రారింభించిరి:

విప్రదంపతులారా! సృష్ట్యాదియందు ఏ యితర పదార్ధములులేని సమయమున అకార, ఉకార, మకారనాద సంయోగములచే ప్రణవనాద మేర్పడి అందుండి ఆది అంతములులేని మహాజ్యోతి వెల్వడెను. అందుండి విరాట్ విశ్వకర్మ భగవానుడుద్భవించెను. ఆయన సాకారుడు నిరాకారుడు, వీరే పురుషుడు, వీరి అర్ధశరీరమేగాయత్రీమాత యిటుల వేదపురుషుడు వేదమాతయూ అర్ధనారీశ్వరులైన ప్రధమ ఆది దంపతులు ఈ విరాట్ పురుషుని పంచముఖముల నుండి వరుసగా మను, మయ, త్వష్ఠ, శిల్పి, విశ్వజ్ఞబ్రహ్మలను సృజించి, వేదమాత పంచముఖముల నుండి వరుసగా ఆదిశక్తి, పరాశక్తి, యిఛ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞాన శక్తులను వరుసగా సృజించి



మను బ్రహ్మశివునకు ఆదిశక్తి పార్వతిని, మయబ్రహ్మ విష్ణువుకు పరాశక్తిలక్ష్మిని, త్వష్ఠబ్రహ్మ బ్రహ్మకు యిఛ్ఛాశక్తి సరస్వతిని, శిల్పిబ్రహ్మదేవేంద్రునకు క్రియాశక్తి శశిదేవిని, విశ్వజ్ఞబ్రహ్మ సూర్యునకు జ్ఞానశక్తి సంజ్ఞాదేవినొసంగి, త్రిభువనములు, పంచభూతములను అష్టదిక్పాలకులను, నవబ్రహ్మలను, కోటానుకోట్ల నక్షత్రములను నవగ్రహాములను ఏకాదశ రుద్రులను, ద్వాదశ ఆదిత్యులను, పదనాల్గులోకములను అఖిలసురులను, అసురులను, గరుడ, గంధర్వ, యక్ష, కిన్నెర, కింపురుష, సిద్ధ సాద్యులను, విద్యాధరులను, 84 లక్షల జీవరాసులను, సంకల్పమాత్రముచే సృజించి, ఈ అనంత విశ్వపరిపాలనా బాధ్యతలను పై పంచజంటలకప్పగించి, అణువునుండి బ్రహ్మాండ మంతయూ తా నుండి, సకల చరాచరజీవరాసుల యందు తానదృశ్యముగా నుండి విరాట్ విశ్వకర్మ భగవానుడదృశ్యుండాయెను. అంతకొంతకాలం వరకూ ఈ పంచదైవ జంటలకు తమ కర్తవ్యం సరిగా బోధపడని వారై, అందరూ కలసి ఆలోచించి ఆవిరాట్ పురుషునికై యాగము చేయసం కల్పించిరి. అమితదీక్షతో వారాచరించు యాగమునకు పరవశించి విరాట్ పురుషుడు యజ్ఞజ్వాలలనుండి ప్రత్యక్షమాయెను. అంతపంచదైవ జంటలు పరమేష్టికికై మోడ్చి తమ కర్తవ్యములు తెలుపమని కోరగా! వారి బాధ్యతలు వివరంగా తెలిపి నిరంతరం యోగముద్రలో నాసాక్షాత్కారము పొందినా యాజ్ఞలను నిర్వర్తింపుడని తెలుపగా! పంచదైవజంటలు అంజలిఘటించి, భవిష్యత్తులో దేవ, దానవ, మానవులు, అష్టైశ్వర్యములతో సుఖముగా జీవించు క్రమముతెలుపమని కోరగా! దేవాదిదేవుండు సంతసించి కృతత్రేతా యుగములలో గాయిత్రి విశ్వకర్మ వ్రతమును, ద్వాపరయుగం, కలియుగం 5 వేలసంవత్సరముల వరకూ నాయంశయగు కేదారేశ్వర,అర్ధనారీశ్వర వ్రతమును, కలి 5 వేలుగడచిన పిదప మరల నాయంశ యగు సనారీశ్వర

వ్రతాన్ని భక్తి శ్రద్ధలతో చేసిన అష్టైశ్వర్యములు పొందగలరని తెలుపగా! వారందరూ.. విరాట్ పురుషునకు చేతులు జోడించి

**శ్లో॥ జ్యోతిర్మయం, శాంతిమయం ప్రదీప్తాం, విశ్వాత్మకం,**
**విశ్వపతిం వీరేశం, ఆద్యంతశూన్యం, సకలైకనాథం,**
**శ్రీపరమేశ్వర పరబ్రహ్మ విశ్వకర్మణ మానందబ్రహ్మాం**
**అష్టైశ్వరదాయక మహోంనమామి, దివిభువ్యంతరిక్ష నివాసి।**
**సర్వశః యత్నించి శ్శిల్పినాం, శిల్పంతత్ప్రవర్తకతే నమః।**

విశ్వసంసార బీజాయానమస్తే, విశ్వమూర్తయే, విశ్వాయ, విశ్వరూపాయ।
విశ్వకర్మా ఆనంద బ్రహ్మా, సనారీ, పరమార్థాయ।
పరమపురుషాయ, మహాత్మనే శుద్ధతత్వ స్వరూపాయా,
గాయత్రీ విశ్వకర్మణే, అష్టైశ్వర్య ప్రధాతా,
నిత్యానంద బ్రహ్మ సనారీ నమోస్తుతే!

ఈ విధంగా పంచదైవ జంటలు ప్రార్థించగా! విశ్వకర్మభగవానుడు సంతసించి, ప్రళకాలంబున ఉరుములు బోలు చందంబున.

**తే॥ మనసునాముష్మికాశను మట్టుపరచి**
**ననువుగల నైహికంబుననంటుదగల**
**నోపగాబోరు నాయందు గోరునూరు**
**తనుమనంబులు నావిగాదలపువారు॥**

**గీ॥ పాదములు శిశ్నపాణులు ఫాలపెణత**
**ఘోణతలలును బ్రహ్మాండగోళమంత**
**సందులేకుండ నిహపరసాధనముల**
**నొందుచుందురు దేహంబునుండువరకు॥**

అని ఆశీర్వదించి జ్యోతిరూపుండంత ర్ధానమయ్యెను

సనారీ వారిచే జరిపించిన ఈ వ్రతానికి ఫలితము



ఓం శ్రీ సనారీశ్వర దేవాయనమః:

ఈ ద్వాదశాక్షరముర మంత్రఫలితము

**ఓం** అకార, ఉకార, మకార, నాదసంయుక్తం ప్రణవనాదం విరాట్ విశ్వకర్మ రూపం, సృష్టి స్తితిలయకారకం

**శ్రీ।** మహాబీజం, సర్వశక్తి సమన్వితం, లక్ష్మిబీజం అష్టైశ్వర్య ప్రధాయకం

**స।** తమోబీజం, తమోగుణప్రధాయకమౌయక్షబీజం సర్వసిద్ధిప్రధాయకం

**నా।** వారుణీబీజం, సర్వదేవనమస్కృతం, ధూమబీజం మోక్షప్రధాయకం

**రీ।** వహ్నిబీజం తేజోరాశిం శివాత్మకం రుద్రబీజం రక్షితాద్వరభాగం

**శ్వ।** లక్ష్మిబీజం, సర్వాభీష్టసిద్ధికరం, మహాబీజం శివప్రత్యక్షకారకం

**ర।** రుద్రబీజం రజోగుణవిద్వంసకరం శివసారూప్యం

**దే।** నైరుతిబీజం సర్వశత్రు సంహారకరమ్ సకల శుభప్రధాయకం

**వా।** వారుణీబీజం, విశ్వత్మకం విశ్వకారణమ్ అపమృత్యునివారకం, వీరభద్రేశం

**య।** వాయుబీజం,పరమేశ్వరసంస్థితం వాయుతత్వం సర్వత్రత్వాత్మకారకం

**న।** ధూమబీజం, సచ్చిదానంద స్వరూపం, వారుణీబీజం, సర్వసంకట హరణం

**మః** మంగళబీజం, నాదబిందుకళాతీతం, పార్వతీబీజం చాతుర్మాసాత్మకపరం సిద్ధికరం

యిట్టి అక్షర ప్రభావమును గుర్తించిన భక్తి భావముతో వ్రతమాచరించి యిహ పరసౌఖ్యములంది తరించగలరని స్వామి వారు తెలుపగా అచట గల వారందరూ స్వామీ తమరు సాక్షాత్ పరమేశ్వరునివోలే కన్పించు చున్నారు. మీ నిజరూపును ప్రదర్శించుడని ప్రార్థింపగా స్వామివారు మంత్రజలం వారిపై జల్లిగా అందరూ సుషుమ్నావస్తలో అచేతనులై కళ్ళప్పగించి స్వామివారిలో విశ్వకర్మ గాయత్రీల అర్ధనారీశ్వరరూపం, శివపార్వతుల అర్ధనారీశ్వర రూపాన్ని, అన్నపూర్ణా, విశ్వనాధుల,

సనారీశ్వరుల, రూపములను పరమానంద పారవశ్యమున వారందరు శరీర స్పృహలేక వీక్షించి కొంతసేపటికి తెప్పరిల్లి కలయోనిజమో ఎరుంగలేక భక్తితో అందరూ సనారీశ్వర దేవాయపాహిమాం, పాహిమం రక్షమాం యనుచూ సాష్టాంగదండ ప్రణామములాచరించి చూచుసరికి సనారీవారు అదృశ్యులైరి. విప్రదంపతులు జీవితాంతముఈ వ్రతమాచరించి, యిహలోక సౌఖ్యములనుభవించి అంత్యమున ఆ దేవదేవుని యందు ఐక్యముయిరి.

- ప్రథమాధ్యాయం సమాప్తి -

**కొబ్బరి కాయ కొట్టి కర్పూర నీరాజములనిచ్చి నమస్కరించిరి.**

## ద్వితీయాధ్యాయం

స్వామివారు నెల్లూరు పురవీధులలో వెలుతుండగా సదా చార సంపన్నులు, శివపూజాదురంధరులు, ఆధ్యాత్మిక చింతనతో సద్గురువుకై అన్వేషణచేయుచున్న సర్వేశ్వరరెడ్డి హైమవతీ దంపతులు బ్రహ్మతేజస్సుతో వెలుగొందుస్వామిని జూచి సాష్టాంగదండ ప్రణామములాచరించి, వారిని గృహమునకు తోడ్కొని పోయి సకలోపచారములు అత్యంత భక్తి శ్రద్ధలతో చేయుచుండగా సర్వేశ్వరరెడ్డి ప్రాణగండము గ్రహించిన గురుదేవులు ఆ దంపతులతో సనారీశ్వరవ్రతం చేయించుచుండగా వ్రత మధ్యలో సర్వేశ్వరరెడ్డి తీవ్రమగు జ్వరంబాధతో మంచానబడెను. స్వామివారు హైమవతితో అత్యంత భక్తిశ్రద్ధలతో వ్రతంపూర్తిచేయించగా, సర్వేశ్వరరెడ్డి, ప్రాణములు హరింప వచ్చిన మృత్యుదేవతకు ఆ గదియందు విరాట్ పురుషుని దివ్యకాంతి ప్రసరించుసరికి ఆ తీక్షణమును తాళజాలక మృత్యుదేవతపారిపోయెను. ఆ దివ్యకాంతి స్పర్శచే సర్వేశ్వరరెడ్డి జ్వరతీవ్రత తగ్గి నూతనోత్సాహముతో మంచపై నుండి లేచి, భార్యద్వారా విషయ మంతయు తెలుసుకుని, తన ప్రాణదాతకు ప్రణమిల్లుటకై దంపతులు



స్వామివారున్న గదివద్దకువెళ్ళి చూడగా స్వామివారచటలేరు. ప్రాణదాతకు సాష్టాంగదండ ప్రణామములాచరించలేకపోయితిమనుకొని బాధనొంది, అంతలోనే సాక్షాత్‌పరమేష్టి తమ యింట కొన్నాళ్ళుండి పతికి ప్రాణభిక్షపెట్టి తన మాంగల్యరక్షణగావించుట తమ పూర్వాజన్మ పుణ్యమో, పెద్దలతపః ఫలంబోయని ఆనందించి తక్షణమే సనారీదీక్షను స్వీకరించి వానప్రస్థాశ్రమ జీవనంగదుప నిశ్చయించుకొని, తమస్థిరచరాస్తులు యావత్తూ దీర్ఘరోగులకు, అభాగ్యులకు, అనాధలకు, నిరుపేదల సేవలకై వినియోగించుతూ తమ గృహాన్ని "సనారీ ఆశ్రమంగా" మార్చి వృద్ధులకు ఆశ్రయం కల్పించి, యిరువేళల సనారీ భజనలు చేయుచూ తోటివారితో చేయించుచూ, సనారీ వారు తెల్పిన ఆధ్యాత్మిక విషయములు, యోగ సాధనలు, ప్రకృతిధర్మములు, సత్సంగములలో తెల్పుచూ, నిత్యాన్న దానములు చేయుచూ, సనారీశ్వర వ్రతం చేయుచూ, తోటివారితో చేయించుచూ, భక్తి పారవశ్యమున జీవనముచేసి అంత్యమున ఆ దేవ దేవుని యందు ఐక్యమయిరి.

- ద్వితీయాధ్యాయం సమాప్తి -

**కొబ్బరి కాయ కొట్టి హారతినిచ్చి అందరూ కనులకద్దుకొని నమస్కరించిరి.**

## తృతీయాధ్యాయం

బాలాత్రిపురసుందరి సనారీవామాంకమునుండి తన జననకారణమిట్లు చెన్నపట్టణ హైకోర్టు ఎదుట మహాజన సమక్షమున తెల్పెను.

నాయనలారా! నేను నవబ్రహ్మలలోని దక్షప్రజాపతి గర్భమున శశీదేవిగా జన్మించి చంద్రశేఖరుని వివాహమాడితిని. నా తండ్రియాగము చేయుచూ పరమేశ్వరుని పై అలకవహించి మమ్మాహ్వానింపలేదు. పుట్టింటిపై మమకారమున పరమేష్టివలదన్ననూ ఆయజ్ఞమునకు బోయి తండ్రిచే పరాభవించబడి యోగాగ్నిచే నన్ను నేను దగ్ధముచేసుకొంటిని. ఆ పిదపనా కొరకు కఠోరతపస్సు నాచరించు మేనకాహిమవంతులకు పార్వతినై జన్మించి

నిరంతర జపతపములు సలిపి ఈశ్వరుని సేవించి కఠోరవ్రత దీక్షచే శివుని సతినైతిని, మాకల్యాణమునకు త్వష్టబ్రహ్మ పౌరోహిత్యము చేయుచు నా చతుర్ధశభువన సౌందర్యమును కామదృష్టితో వీక్షింపు శిరమును పరమేష్టి ఖండింపగా , పశ్చాప్తుడగు బ్రహ్మదేవుడు నన్ను ప్రాయశ్చిత్తమును కోరగా తండ్రీ నీవు కలియుగంబున భూలోకమందలి కల్యాణపురమున బ్రహ్మానందాచారిగాజన్మించి, భ్రమరాంబను వివాహమాడి మీ దంపతులు నా కొరకు చేసిన తపఃఫలంగా, మీకు పుత్రికనై అన్నపూర్ణ అనునామంబున ఈ అఖండ పరశుని వివాహమాడి కొన్నేండ్లు రాజ యోగాశ్రమముగడిపి, నిరతాన్న దానములు నిర్వహించిస్వామి వారి యాజ్ఞచే పాలకొండలో జీవసమాధిని ప్రవేశించి స్వామి వారి అర్ధశరీరమునై యుండి కొన్నేండ్లు గడచిన పిదప మరల స్వామివారి యాజ్ఞచే కర్నాటక దేశమును వైశ్యకులంబున రత్నాలశ్రేష్ఠియనబడు ఈనారాయణశ్రేష్టి దంపతుల అమోఘ తపఃఫలంగా బాలాత్రిపుర సుందరిగా వారికి జన్మించి నా తండ్రితో తీర్ధయాత్రలు చేయుచూ విశ్వనాధుని అర్ధ శరీరమగు నేనే మీ అందరి సమక్షమున వారి వామ భాగమధిష్టించితినని తెల్పుచుండగా రత్నాలశ్రేష్ఠిదిగ్భ్రాంతి నుండి తేరుకుని తల్లీ నా జన్మరాహిత్యము తెలుపమని ప్రార్ధించగా! నాయనానీవు గతజన్మలో హేలాపురి(ఏలూరు) లో వైశ్యులయింటిజన్మించి సుబ్బయ్యశెట్టి నామముతో పిలువబడితూ నిత్యాన్నదానములు చేయుచూ, ఆశ్రయించిన వారి అవసరములు తీర్చుతూ, జీర్ణదేవాలయములు పునరుద్ధరణ గావించుతూ భక్తి జ్ఞాన వైరాగ్యములు గలిగి యోగసాధనలతో నా సాక్షాత్కారమునకై తీవ్రకృషి సల్పుచుండగా నేను సంతసించి ఒకనాడు యోగములో సాక్షాత్కరించగా చంచలమనస్సుతో నను వీక్షింపగా నేనాగ్రహించి ఓరీ నీవెన్ని తపములు, జపములు యోగ సాధనలు చేసిననూ అరిషడ్వర్గములు జయించలేకపోయితివి గాన కామాగ్ని లోదగ్ధము కమ్మని



శపించగా! నీవు పశ్చాత్తాపముతో జగన్మాతానా అజ్ఞానము మన్నించి రక్షింపుమనగా! కుమారా నీవు చేసిన తప్పుకు శిక్ష అనుభవించవలసినదే నీవు చేసిన సత్కార్యఫలమున కర్నాటదేశమున వైశ్యులయింట నారాయణ శ్రేష్టిగా జన్మింతువు. నీ పూర్వజన్మ తపఃఫలంబున నీకు కుమార్తెగా జన్మింతును.

గత జన్మ కామదృష్టి ఫలితముగా పాండురోగివై పుణ్యక్షేత్ర సందర్శన, పుణ్యనదుల స్నానము పుణ్య పురుషుల పాదసేవతో జన్మతరింపజేసు కొనుటకు నాతో తీర్ధయాత్రులు చేయునపుడు, నా నిజరూప సందర్శనచే నీపాపము నీ దోషములు పరిహారముగునని తెలుపగా! తనగతజన్మ విశేషములు విన్నరత్నాలశ్రేష్ఠి భక్తి భావముతో కరములుజోడించి తల్లీ జగన్మాతవు యాయింట జన్మించి మాతో తిరుగుచున్ననూ గుర్తించని అంధుడను. పెరటిలో గల పెన్నిధిని గుర్తించలేని మందభాగ్యుడను. తల్లీ నీవిపుడు నీ పతిని జేరితిని నాకేదిదారియని ప్రార్ధింపగా తండ్రీ ఈ జన్మమున నీవు అభాగ్యులను, అనాధులను, ఆర్తులను ఆదరించి నిత్యాన్న దానములు చేయుచూ, సనారీశ్వర వ్రతము చేయించుచూ ప్రచారం గావించుచూ సనారీ సంవాదమందలి యోగసాధనలతో జన్మనుతరింపజేసు కొనుము. ఈ సత్ ఫలితములచే మరుజన్మలో విశ్వబ్రాహ్మణకులమున జన్మించి "రామబ్రహ్మనందమహర్షివై" రాజకన్యలను ఎనిమిది మందిని వివాహమాడి బెండపూడి లో ఆశ్రయము నెలకొల్పి హిందూమతోద్ధారణ, సనాతన ధర్మపరిరక్షణకై కంకణం కట్టుకుని, అఖండ అన్నదానములు సల్పుచూ జన్మతరింపజేసుకొని నా యందు ఐక్యమగుదువు అని విశ్వనాధుని వామాకము నుండి పతి దేవుని అనుమతితో అదృశ్యమాయెను. నాటినుండి రత్నాలశ్రేష్టి తన శక్త్యానుసారము ఆపన్నులకు, అనాధలకు అన్నదానములు చేయుచూ తన బంధు మిత్రాదులనురావించి, తన చరిత్ర తెల్పుచూ, సనారీ

వారి మహాత్యములు వివరించుతూ సంవాదమందలి విషయములకు అర్థములు చెప్పుచూ, యోగ సాధనా పద్ధతులు వివరించుతూ, సనారీ చరిత్ర ప్రచారం గావించుతూ, నిరంతరం యోగధ్యానములతో నుండి అంత్యమున పరమపదమునొందిరి.

**- తృతీయాధ్యాయం సమాప్తి -**

**కొబ్బరి కాయ కొట్టి దైవానికి హారతులిచ్చి అచట గల వారందరి కనులకద్దుకొమ్మని.**

## చతుర్థధ్యాయం ప్రారంభం

విజయవాడ సమీపగ్రామమగు వల్లభాపురమునకు దక్షిణమునగల కృష్ణానది మున్నంగిగ్రామమునకు ఉత్తరముగా ప్రవహించుతూ రెండు గ్రామాలను మధ్యనుండి మచిలీపట్నణం దగ్గర సముద్రంలో కలియును. ఈ రెండు గ్రామాల మధ్యదూరము దాదాపుగా 2 మైళ్ళ దూరముండును. వల్లభాపురమున బలిజకులస్తుడగు కోటయ్యయను సనారీభక్తుడుకలడు. అతడు గృహస్త్రాశ్రమధర్మములు చక్కగా నిర్వర్తించుచూ స్వామివారి గ్రంథం నిత్యపారాయణచేయుచు, అందలి యోగసాధనా పద్ధతులనాచరించుతూ "రాజయోగి" యై ప్రశాంతమగు జీవనము చేయుచూ స్వామివారి దర్శనభాగ్యమునకై తపించుచుండెను.

**స్వామివారి అభయము**

మూలపంజరహృదయాత్మ మాత్రుకులను
న్యాసకవచము దిగ్బంధనము జీవమంత్రము
చేతనాచౌచమంత్రములను
ధ్యానమును చేయ నెలలోన కానబడుదు. అనుటచే

స్వామివారు తనను త్రికరణశుద్ధిగా సేవించువారికి తప్పక దర్శన మిత్తురన్న విశ్వాసంతో సర్వకాలసర్వావస్తలయందును సనారీమూల



మంత్రము ను జపించెడివాడు. ఒక కార్తీక పున్నమినాడతను కార్యార్థియై మున్నంగి గ్రామమునకుబోయెను. అచట తన పనిపూర్తియగు సరికిరాత్రి 9గం॥లు దాటినది. మున్నంగి నుండి కృష్ణానది వరకు దట్టమగు తుమ్మబీడులుండుటచే, అతనికి క్రమ క్రమముగా భయము అధికమగుటచే స్వామివార్ని తలచుకుంటూ కృష్ణానది గట్టు చేరుసరికి, కట్టమీద స్వామివారు రుద్రాక్షమాలాంకృతు లైకాషాయాంబరములు ధరించి, జింక చర్మము పై దండకమండలములు ప్రక్కన పెట్టుకుని కూర్చునిఉన్నారు. కోటయ్య స్వామి వారిని చూచి తనకు తోడుదొరికిందని ఆనందపడుచూ, స్వామీతమదేవూరు యిచట కూర్చుంటిరేమని ప్రశ్నించెను? స్వామివారు నాయనా మాది పాలకొల్లు, దేశాటన చేయుచూ ఈ ప్రశాంతవాతావరణమున విశ్రమించు చుంటిననిరి. కోటయ్యస్వామీ తమరు నాతో మా యింటికివచ్చి మా గృహముపావనం జేయుడు నేను బలిజకులస్తుడను. మీరుయజ్ఞోపవీతముతో బ్రాహ్మణుని వలెనున్నారు. నాతో వచ్చిన మీకు స్వయంపాక సామాగ్రి యిచ్చెదను. మీరే ఆహారము తయారు చేసుకుని భుజించి మమ్మానందింప జేయుడని ప్రార్థించెను. స్వామివారు నవ్వుచూ నాయనా దానికై అంతదూరమురావలెనా అవన్నీయూ యిచటలేవా? యనిరి. అప్పటికీ ఆభయస్తునకు స్వామివారు జ్ఞప్తికి రాలేదట త్వరగాయిల్లు చేరవలెనను భావంతో స్వామి చాలా పొద్దుపోయింది యింటికి పోతాను. సెలవీయండని నమస్కరించగా అంత తొందరగా ఉంటే క్షేమంగా యిల్లు జేరు నీవు నమ్మినదైవమే నీతోడుందురనిరట. కోటయ్య త్వరగా యిల్లు చేరాలనే తలంపుతో వస్తాస్వామీయని పది అడుగులవేసి వేనుకకు తిరిగి చూడగా అచట ఎవ్వరుకానరాలేదు. వెంటనే సనారీ వారు గుర్తుకువచ్చిఅయ్యోనేనెంత నిర్భాగ్యుడను నా ఆరాధ్యదైవము నాకు రక్షగా వెన్నంటివచ్చిననూ గుర్తించలేక పోయితిని స్వామివారు చాలా వివరంగా చెప్పినా తెలుసుకోలేని మందబుద్ధినైతినని విచారించుచూ వెంటనే అలాకాదు చాలా అదృష్ట

వంతుడను నేను సేవించుదైవము నా వెన్నుకాచియుండగా నాకేమి కొదువ అనుకొని స్వామి వారు తన వెనుకనే వస్తున్నారన్న భావంతో ధైర్యంగా యిల్లుచేరి నాటినుండి నిత్యపూజక్లుప్తంగా చేస్తూ మానసపూజ ఎల్లవేళల చేయుచూ స్వామివారి దీక్షభూని స్వామివారి మహిమ ప్రచారం చేయుచూ ప్రతీ పౌర్ణమికీ సనారీశ్వరీ వ్రతం చేయుచూ బందుమిత్రులతో చేయించుచూ స్వామివారిని పూజించు వారికి గురుదేవులు వెన్నంటి కంటికి రెప్పవలె కాపాడుచూ ఏదో రూపంలో భక్తులకు దర్శనమిత్తురని తన అనుభవములు తెల్పుచూ గురుదేవులను నమ్మినవారికి భుక్తిముక్తులకు లోటుండుదని మోక్షసామ్రాజ్యము అతి చేరువలో కలదని తెల్పుచూ అంత్యమున కైలాసప్రాప్తినొందిరి.

**చతుర్ధాధ్యాయం సమాప్తం**

**కొబ్బరికాయ కొట్టి హారతి నారాజములనిచ్చి అందరిని కనులకద్దుకొమ్మనిరి**

## పంచామాధ్యాయం ప్రారంభం

పాలకొండగ్రామమున సకల సద్గుణములుగల కాపు దంపతులు కలరు. వారికి వివాహమైన చాలాకాలం వరకు సంతానము కలుగలేదు. వారు అనేక వ్రతములు పూజలు చేసిననూ ఫలితములేకపోవుటచే, వీరాచారి గారితో తీర్థయాత్రలు చేసి దైవకృపచే కల్గిన కుమారునకు సాంబయ్యని పేరుపెట్టి అల్లారుముద్దుగా పెంచి పెద్దచేసి వివాహ ప్రయత్నములు చేయు తరుణంలో సాంబయ్య పొలంపనికి వెళ్ళితిరిగివచ్చు సమయంలో సర్పకాటుకు గురియై ప్రాణములు కోల్పోయెను. అతనితోనున్నవారు ఈ విషాదవార్తను తల్లిదండ్రుల కెరిగించగా! ఆ వృద్ధదంపతులు ఆర్తనాదములు చేయుచూ పొరుగువారి సహాయమున సాంబయ్య మృతదేహమును తీసుకుని స్వామివారి మహిమలు విన్న వారిగుటచే స్వామివారింటి దగ్గరకు తీసుకుపోయి గురుదేవుల పాదములపైబడి గోడు గోడున ఎద్చుచు



పుత్రభిక్షనర్థించిరి. స్వామివారా వృద్ధ దంపతుల నూరడించి జరిగినంతయూ మనోదృష్టిచే గ్రహించి, అచటకు చేరిన వారందరికి యితనిని కరచిన పాము యిటకు వచ్చును. మీరు కంగారుపడక జరుగుచున్నదానిని ప్రశాంతముగా చూస్తుండుడని స్వామివారు నిర్వికార నిరామయస్థితిలో యోగముద్రలో కూర్చుండి దివ్య దృష్టితో సర్పమును గాంచి యిచటకు రమ్మని ఆజ్ఞాపించిరి వెంటనే సర్పమతి రోషముతో జరజరావచ్చి స్వామివారి పాదాలపై బడి పడిగ నుంచి తప్పు మన్నించమన్నట్లుగా ఉండెను. స్వామివారు దక్షణ హస్తాముతో పడగ సవరించుతూ లెమ్మనిరి. ఆ సర్పము సహజరీతిగా పడిగవిప్పి యాడుచు తమ యాజ్ఞయన్నట్లుగా పడిగవంచి నిలబడియుండెను. విశ్వనాధుడు **సర్పరాజ మా** నిరపరాధుల నిట్టు వధించితివేని ఘోరపాపములపాలై జన్మరాహిత్యము నొందక నరకముల బడుదువు. దీనికి ప్రాయశ్చిత్తముగా వింధ్యాద్రిలో 12 సం॥లు తపమాచరించి జన్మరాహిత్యము బొందుమనగా తమ యాజ్ఞయన్నట్లుగా తలయూపినది. వెంటనే స్వామి, యిపుడునీవొనరించిన తప్పును నీవే సవరించుకొమ్మనగా పాము మృతుని వద్దకుబోయి కాటువేసిన చోట నాల్కుతో విషాన్ని లాగివైచెను. వెంటనే గురుదేవుల కృపాకటాక్షవీక్షణాలతో సాంబయ్య నిద్రమేల్కొన్న వానివలెలేచి కూర్చుండెను. సర్పము తన దారిన తాను నిష్క్రమించెను. పునర్జీవితుడైన యువకుడు స్వామి వారి పాదాలపైబడి విశ్వనాధా దయామయా! పరమ శివావతారా, నా జన్మధన్యమైనది స్వామి మీరు పెట్టిన ఈ ప్రాణభిక్ష నేను జీవించినంత వరకు నిత్యం మీ నామస్మరణచేయుచూ, మీ మహాత్మ్యములు ప్రచారంచేయుచూ మీ వ్రతం ప్రతీ అమావాస్యకు చేయుచూ జన్మను చరితార్థం గావించు కొందునని ప్రమాణముగా పలికి పెద్దలయాజ్ఞచే వివాహంచేసుకుని సత్ సంతాన వంతుడై నిత్యపూజలు చేయుచూ ప్రతీ అమావాస్యకు సనారీశ్వర

వ్రతంచేయుచూ జన్మను సార్థకము గావించుకొనెను. అంటూ మొదలియార్ వ్రతముదగ్గరనున్న వారందరికీ తెలిపి నాయనలారా ఈ వ్రతమాచరించు వారు. చూచినవారు విన్నవారు ప్రచారంచేయువారు. పుస్తక ముద్రణ గావించి పంచినవారు సనారీశుని కృపకు పాత్రులై యిహలోక భోగభాగ్యములనను భవించి అంత్యమున పరలోక సౌఖ్యములనను భవింతురు. యిది భక్తియే ప్రధానముగా గురుసేవయే నిత్యకర్తవ్యంగా ఆచరించి ప్రచారంచేయువారు ధన్యులు.

## లఘుమంత్రపుష్పము
## (పుష్పాక్షతలు చేతిలో పట్టుకుని నిలబడి)

నమస్తే అస్తుభగవాన్
విశ్వేశ్వరాయమహాదేవాయత్రయంబకాయత్రిపురాంతకాయత్రికాగ్నికాలాయ, కాలాగ్నిరుద్రాయ, నీలకంఠాయ, మృత్యుంజయాయ, సర్వేశ్వరాయ, సదాశివాయ. శ్రీమన్‌మహాదేవాయనమః ఓం శ్రీ అన్నపూర్ణాసమేత విశ్వేశ్వరస్వామియే నమః సువర్ణ దివ్యమహ మంత్రపుష్పం సమర్పయామి.

ఓం విశ్వకర్మచ విద్మహే। పంచవక్త్రాయ ధీమహి। తన్నో విశ్వబ్రహ్మః ప్రచోదయా"త్॥

ఓం భూర్భువస్సువః ఓం తత్సవితుర్వ"రేణ్యం । భర్గోదేవస్య ధీమహి। ధియోయోనః తన్నోగాయత్రీ ప్రచోదయా"త్।

ఓం పంచవక్త్రాయ విద్మహే। బ్రహ్మగజాయ ధీమహి। తన్నో మనుః ప్రచోదయా"త్॥

ఓం పంచక్త్రాయ విద్మహే । లోక కర్త్రేచ ధీమహి। తన్నో మయః ప్రచోదయా"త్॥

ఓం పఞ్చవక్త్రాయ విద్మహే। మహాపూజ్యాయ ధీమహి। తన్నో త్వష్టః ప్రచోదయా"త్॥



ఓం పఞ్చవక్త్రాయ విద్మహే। సృష్టి కర్త్రేచ ధీమహి। తన్నో శిల్పిఃప్రచోదయా"త్

ఓం పంచక్త్రాయ విద్మహే। లోకజ్ఞానాయ ధీమహి- తన్నో విశ్వజ్ఞ ప్రచోదయా"త్।

ఓం వీరనారాయణాయ విద్మహే। విరాట్పురుషాయ ధీమహి తన్నో వీరబ్రహ్మా ప్రచోదయా"త్।

ఓం మహాదేవ్యైచ విద్మహే। వీరబ్రహ్మ పత్న్యైచ ధీమహి- తన్నో గోవిందాంబా ప్రచోదయా"త్

ఓం మహాశక్త్యైచ విద్యహే। వీరబ్రహ్మ పౌత్రీచ ధీమహి- తనో ఈశ్వరీ ప్రచోదయా"త్।

ఓం మహాభక్తాయ విద్మహేవీరబ్రహ్మ శిష్యాయ దీమహి తన్నో సిద్ధప్రభోదయా"త్॥

ఓం విశ్వేశ్వరాయ విద్మహే। బ్రహ్మ జ్ఞానదాతాయ ధీమహి- తన్నో సనారీః ప్రచోదయా"త్।

ఓం మహాదేవ్యైచ విద్మహే। సనారీ పత్న్యైచ ధీమహి। తన్నో అన్నపూర్ణాః ప్రచోదయా"త్॥

ఓం సాధుతత్వాయ విద్మహే, ఈశ్వరాంశాయ ధీమహి తన్నో సాయి ప్రచోదయా"త్॥

ఓం వాగీశ్వర్యైచ విద్మహే కామేశ్వర్యైచ ధీమహి। తన్నో కామాక్షీ ప్రచోదయా"త్॥

ఓం సాంబశివానందాయవిద్మహేజ్ఞానదాతాయధీమహీ । తన్నో బోధగురుప్రచోదయా"త్

ఓం బోధగురు పత్నైచవిద్మహే శాంతి స్వరూపాయ ధీమహీ తన్నో గురవమ్మప్రచోదయాత్

## ప్రదక్షణమ్

శ్లో॥యానికానిచపాపాని జన్మాంతరకృతానిచ తానితాని ప్రణశ్యన్తి ప్రదక్షిణ

పదే పదే పాపోహం పాపకర్మాణాం పాపాత్మాం పాపసంభవాం

త్రాహిమాం కృపయాదేవా శరణాగతవత్సలా అన్యథా శరణం నాస్తి

త్వమేవ శరణం మమ తస్మాత్కారుణ్యభావేన రక్ష రక్ష మహేశ్వర రక్ష రక్ష

సనారీ విశ్వేశ్వర రక్ష రక్ష జగద్గురుః

(పీఠం చుట్టూ 3సార్లు ప్రదిక్షణము చేసి సాష్టాంగనమస్కారము చేస్తూ)

శ్లో॥ ఉరసా, శిరసా, దృష్ట్వా మనసావచసా తథా పదాభ్యాం కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామ్యం, అష్టాంగముచ్యతే

ఓం శ్రీ అన్నపూర్ణాసమేత విశ్వేశ్వరస్వామినేనమః సాష్టాంగ నమస్కారం సమర్పయామి

చత్రం: ఓం శ్రీ అన్నపూర్ణ సమేత విశ్వనాధస్వామినేనమః యధాశక్తి పూజాం కరిష్యామి, చత్రం సమర్పయామి, చామరం వీజయామి, నృత్యం దర్శయామి, గీతం శ్రావయామి, వాద్యం ఘోషయామి, ఆందోళి కమారోహయామి, గజమారోహయామి, అశ్వమారో హయామి, సమస్త రాజోపచారాన్ సమర్పయామి, సమస్త దేవో పచారాన్ సమర్పయామి, సమస్త శక్త్యుపచార భక్త్యుపచారాన్ సమర్పయామి. (అక్షతలు ఒక్కొక్క దానికి చల్లాలి).

పరిపూర్ణ: శ్రీ దేవ దేవ మహాదేవ పరాత్పరంవా బోధాసుబోధ పరతత్వ ప్రపంచసర్వే మోదాయ భక్త జనలోక ఫలప్రదాయ విశ్వేశ్వరాయ అమితప్రియదేశికాయ ఓం, హ్రీం సనారీ విశ్వేశ్వరాయనమః యధాశక్తి మమజపం, పూజా జగద్గురు బ్రహ్మార్పణమస్తు (అక్షంతలు చేతిలో వేసుకొని నీళ్ళువదలాలి) మంత్రయుక్తం క్రియాయుక్తం భక్తియుక్తంత త్సర్వంక్షమ్యతాం సనారీ విశేశ్వరసద్గురువే నమః.



## మంగళహారతి

మంగళం మంగళం మహనీయమూర్తికి, శృంగారమూర్తికి, శుభకరునకు మంగళం మంగళం॥

1. నింగిరసాతలము నిండిన వానికి బంగారు హారతి పరమూర్తినీకే, మంగళం మంగళం సద్గురునీకే మంగళం మంగళం.

2. హరిహర బ్రహ్మాది అష్టదిక్పతులకూ అమర దానవ దైత్యానంతునకు ఆదిపుట్టిన శక్తి అవని మానవులకు ఆదియయిన విశ్వానాధా గురువరా నీకే మంగళం మంగళం ॥ సద్గురునీకే మంగళం మంగళం॥

3. యజనా యజనాది యారు కర్మంబుల భజనీయమూర్తి విభాగ్యకరీ కుజన జనఘ్న సంకోచనాశ "ఈశ" భజనీయ మనస్కా భావసద్గురునీకే మంగళం మంగళం॥

4. నాదరూప సర్వనాయికా సయ్యమా నాదనిలయ వేదబోధాధిపా వేదాంత సారభూ విద్యనీవేకానీ పాదారవింద ప్రపత్తి మంగళమిదే మంగళం మంగళం॥ సద్గురునీకే మంగళం మంగళం॥

5. సర్వావర్ణములకు సకలవృత్తులనిచ్చి నిర్వహించితివయ్యా నిఖిలేశ్వరా పర్వతావాసుల పట్టణజనులకు సర్వమిచ్చినావు సర్వజగద్గురువా మంగళం మంగళం॥ సద్గురునీకే మంగళం మంగళం॥

6. ఐహి కులకు నీవు అవని కోరకలీయ అవుతరించినావు ఆత్మేశ్వరా సయ్యమాదేవా మా సర్వమంతయు నిచ్చి సంతోషమునిపుడే సత్కరింతుము గురుశ్రీ మంగళం మంగళం ॥ సద్గురునీకే మంగళం మంగళం॥

7. విష్ణుకూటములందు విరివిగా వెలిసిన వీరశాక్తేయుడవై వెలిసినావు విష్ణు పారలింగవీరుల గలసిన విశ్వనాధా సర్వవిశ్వా దేశికనీకు మంగళం మంగళం॥ సద్గురునీకే మంగళం మంగళం॥

8. అవని భక్తులకెల్ల ఆధారణముచేసి ఆరుమతములకు ఆధారమగుచు నివసించిమాయింట నిజదాసులనుబ్రోవు నిర్మలమూర్తిని నీరాజనంబిదే మంగళం మంగళం సద్గురునీకే మంగళం మంగళం॥

## తీర్థం తీసుకునేది

అజ్ఞానమూలహరణం జన్మ కర్మనివారణం । భక్తి జ్ఞానవైరాగ్య సిధ్యర్థంగురుపాదోదకం పీత్వా ॥(శబ్దం రాకుండా తీర్థం తీసుకుని) ఓం అన్నపూర్ణాసమేతవిశ్వేశ్వరస్వామి నిర్మాల్యం శిరసాగృహ్ణామి (పూజ చేసిన పుష్పాక్షతలు కనులకద్దుకుని శిరసుపై వేసుకోవాలి)

## వ్రత పూజ సమాప్తం

ఓం శ్రీ అన్నపూర్ణాసమేతవిశ్వేశ్వరస్వామినేనమః యధాస్తానము ధ్యాసయామి (చేయగలిగితే శివలింగానికి అభిషేకం, శ్రీ సూక్త, పురుషసూక్తాలు చెప్పుకోవచ్చును.)

## పాలకొండఫలితము

పా = ఫాపులను దివ్య ప్రభోదనలచే పునీతులనుచేయు ఫణ్యభూమి

ల = లాలించి, భోదించి, భుక్తి, ముక్తి మార్గములను జూపుమహిమగలది.

కొం = కొండంత అండగా నిలుచు కల్మషహారుని జన్మస్థలమిది

ధ = ధంగుల్ వలదని తెలిపి బ్రహ్మజ్ఞానము, బోధించిన దయామయుడు విశ్వనాధుడు యిట్టి దివ్య ప్రభోదనలు చేసిన సాక్షాత్ శివస్వరూపుని జన్మ స్థలమగు పాలకొండ పరమ పవిత్రమాయెను.

❀ ❀ ❀



## శ్రీశ్రీశ్రీ సనారీవారి ద్వాదశసూక్తులు

**ఓం హ్రీం, శ్రీం, ఐం క్లీం, సౌః, సౌః, క్లీః, ఐం, శ్రీం , హీం, ఓం**

1. మా మూలమంత్రమును సదా పఠిస్తూ ఆనందాన ఉండేరు.
2. భక్తులకు ఏ ఆపదలు ఉండవు మేమే రక్షించుచుందుము
3. మమ్ము దూషించినా సహింతుము, మా భక్తులను దూషించిన సహించము.
4. సనారీ భక్తులు ఈశ్వరాంశులైయుందురు.
5. నన్ను, నా అర్ధాంగిని, నా గ్రంధమును, పూజించువారి సర్వదోషములు బాపి సకల కొర్కెలు తీర్చెదము.
6. మేము, ఉదార మనుష్యులు, సంయమాదుల హృదయము లందు నిల్చేము.
7. పుణ్యపురుషులకు, పతివ్రతామ తల్లులకు భుక్తిముక్తులోసంగేము
8. దాన, ధర్మములుచేయువారు, ఎవ్వరినీ దూషించనివారు, వేరొకరి సొమ్ముకు ఆశపడనివారు మాకు అత్యంత ప్రీతిపాత్రులు
9. తోడేకొలది బావిలో నీరు, దానధర్మాలను చేయుకొలది సంపదలు వృద్ధిచెందు తుంటాయి.
10. పూర్వజన్మ కర్మలే ప్రస్తుతము నీవనుభవించునది. మమ్ము ఆశ్రయిస్తే క్రమంగా నీ బాధలు తొలుగుతాయి.
11. నీ మనసు మా యందు లగ్నంచేస్తే బ్రహ్మజ్ఞానం లభిస్తుంది. లేకుంటే అజ్ఞానంలోనే ఉంటావు.
12. మమ్ము పూజించువారిని సదా వెన్నంటి కాపాడుచుందుము

**సకల జనులు పాలకొండ అన్నపూర్ణ మఠమందు పూజించి నిద్రించిన మా సంపూర్ణ అనుగ్రహము పొందగలరు.**

## శ్రీ సనారీ విశ్వేశ్వర సంవాదము (ఫలితము)

శ్రీ=యన సిరిసందలు, కీర్తినిచ్చి సకల శుభములు చేకూర్చునది
స=యన సాకార నారాయణుడు కాగల యోగసాధనా పద్ధతుల నిలయము
రీ=యన రిపుచింతనలు పోగొట్టి సత్సాంగత్యమొసగు సంద్రమిది
వి=యన వివరించి చెప్పిన వేద వేదాంగషట్ శాస్త్ర ఉపనిషత్ సారమిది.
శ్వే=యన శ్వేదమురాని సుఖమగు యోగసాధనలు తెల్పిన గ్రంధరాజమిది
శ్వ=యన స్వయంభూ విశ్వకర్మ నెలవుకను గొను పద్ధతులప్రాకారమిది.
ర=యన రమ్యమగురచనల యోగప్రక్రియ పరశువేదియిది.
సం=యన సంసారమున ఉండి సత్పురుషునిగా చేయుగల సద్గ్రంధరాజమిది.
వా=యన వావివరసలు, నీతి నియమాలు తప్పు వారికి వజ్రాయుధ ఘాతమిది
ద=యన ధనమునకు ప్రాధాన్యతలేని ధార్మిక గుణములు నిలయమిది
ము=యన ముక్తి భుక్తికి లోటురాని మహోదధియిది

యిట్టి మహిమలు గల గ్రంధమందలి పూజావిధులను త్రికరణశుద్ధిగా ఆచరించి సనారీ వ్రతమాచరించినవారు యిహమందు ఆయురారోగ్య అష్టైశ్వర్యములతో తులతూగి అంత్యము పరలోకసౌఖ్యములను భవింతురు.

కొబ్బరికాయ కొట్టి హారతివెలిగించి మంగళహారతి దైవానికిచ్చి భక్తులందరూ కనులకద్దుకుని తీర్థ ప్రసాదములు స్వీకరించవలయును.

ఓం శాంతిః శాంతిః శ్శాంతిః



## షడ్విద గురుశిష్య సంబంధములు

**1. మార్జాల కిశోరన్యాయము :**

పిల్లిపిల్లలను పెట్టి అనువైన చోటుకు వాటిని మార్చుతూ తనంత చేసి విద్యలన్నీ నేర్పి వదిలి వేయుట. గురువుగారు శిష్యుని అలా తయారుచేయుట

**2. మర్కట కిశోర న్యాయము :**

కోతి తనపిల్లలను పట్టించుకోకుండా చెట్టు కొమ్మలనుండి దూకుట పిల్లపట్టేగానీ తల్లిపట్టుండదు. అలా గురువు శిష్యుని పట్టించుకోడు శిష్యుడు తెలివితో గురువుగారి విద్యలనభ్యసించుట

**3. భ్రమరకీటక న్యాయము :**

తుమ్మెదమట్టిగూడు కట్టి గడ్డిపురుగులను తెచ్చి కుట్టి గూటిలో పడవేసి ఝుంకారము చేస్తుంటే, బాధతో భయంతో దాని రూపుని తలచుకుంటూ తుమ్మెదలా మారుట అంటే బయపెట్టి హింసించి శిష్యునకు విద్యనేర్పుట

**4. విహంగమార్గము :**

పక్షిరెక్కలను మూసి పిల్లలను చేసిపెంచి తనంతచేయుట అంటే గురు సంరక్షణలో శిష్యునికి సకల విద్యలు నేర్పుట

**5. మీనమార్గము :**

చేపలు గుడ్లు పెట్టి వేరొక చోటుకుబోయి ఎల్లప్పుడూ గుడ్లను తలంచుచుండగా పిల్లలైనట్లు అంటే గురువు శిష్యునకు చెప్పినవి ఎలా చేస్తున్నాడని పదే పదే తలంచుచూ తనంత చేయుట.

## సనారీ వారి ఉపచార లఘుపూజావిధిః

శ్లో॥ వామాంక పరాశక్తిః  వాణీలక్ష్మీద్విపార్శ్వ యోః  వ్యోమాతపత్రదిక్పాలా సామావేదా గమోవిదిః। కౌమార్తి సంయమోధ్యుక్తాః గానధ్యానమనోహితః। యిమెంమండల మధ్యస్తంవిశ్వనాధాంభజామ్యహమ్॥

| | |
|---|---|
| 1. ఓం సనారీ విశ్వనాధాయనమః | ధ్యానంసమర్పయామి |
| 2. సద్గురు దేవాయ నమః | ఆవాహనం సమర్పయామి |
| 3. క్షీరగిరివాసాయనమః | రత్నసింహాసనం సమర్పయామి |
| 4. అన్నపూర్ణేశ్వరాయనమః | పాద్యం సమర్పయామి |
| 5. జగద్గురవేనమః | అర్ఘ్యం సమర్పయామి |
| 6. హనుమధ్వజాయ నమః | స్నానం సమర్పయామి |
| 7. కౌపీనధారణాయనమః | వస్త్రం సమర్పయామి |
| 8. సర్వలోకేశ్వరాయనమః | యజ్ఞోపవీతం సమర్పయామి |
| 9. కఠారిధారిణేనమః | గంధం సమర్పయామి |
| 10. సింహాద్రి విశ్వనాధాయనమః | అక్షతాన్ సమర్పయామి |
| 11. పరిపూర్ణ గుణాయనమః | పుష్పం సమర్పయామి |
| 12. ధూమ్రాక్షాయనమః | ధూపం సమర్పయామి |
| 13. బ్రహ్మతేజసే నమః | దీపం సమర్పయామి |
| 14. సనాతన ధర్మ రక్షాయనమః | నైవేధ్యం సమర్పయామి |
| 15. సకలలోకసాక్షిణే నమః | తాంబూలం సమర్పయామి |
| 16. త్రిలోచనాయ నమః | కర్పూరనీరాజనం సమర్పయామి |
| 17. సర్వలోకగురవేనమః | సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి |
| 18. బ్రహ్మజ్ఞానదాతాయనమః | ఆత్మప్రదక్షిణనమస్కారం సమర్పయామి |
| 19. సచ్చిదానంద రూపాయ నమః | సాష్టాంగదండప్రమాణం సమర్పయామి |

ప్రస్తుత కాలంలో జీవనపోరాటంతో అహర్నిశలు శ్రమించువారు ఈ పూజకు నిత్యం ఒక ఐదునిముషాల కాలాన్ని ప్రశాంతతో వినియోగించి కలిప్రభావముచే కలుగుసకల దోషములనుండి విముక్తులై సుఖశాంతులతో జీవింతురుగాక.

ఇట్లు , సుగంధం సాయిబాబా చార్య సిద్ధాన్తి (విశ్వకర్మ)
సెల్ : 9290582110, 9032253205






శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వరస్వామి పీఠాధిపతులు



పీఠాధిపతులను నూతన వస్త్రములతో సత్కరిస్తున్న
చి॥ కంటె శివకుమార్, పుణ్యస్త్రీ శ్రీమతి దుర్గాంబ